# విజ్ఞాపనము

సహృదయులారా !

శ్రీధాత – ఈశ్వర నామసంవత్సరములందలి దేవీనవరాత్రములందు రచించిన కొన్ని ఖండకావ్యములను నంతకుఁ బూర్వము రచించినవాని కొన్నిటిని సమకూర్చి "భావతరంగిణి" పేరఁ బ్రచురింపింప నిశ్చయించితిని. విశ్వాత్మ–వృత్తి కావ్యమును సానుభూతితో నెమ్మదిని విషయ ప్రాధాన్యముపై మక్కువఁ జూపి లోకవృత్తముల సరిఁజూచి వానిని సూత్రప్రాయముగ ప్రదర్శించిన నాబాలకవితపై సమతఁజూపిన నాకవిత భావతరంగిణిగా సార్థకతనొందునని తలంతును. అంతియకాక నావిద్యార్థిదశ–ఉద్యోగప్రారంభదశలందు నిది రచింపఁబడుటవలన నిందలి ఖండభాగములలోని విషయములు విస్పష్టతను బ్రదర్శింపకపోవచ్చును. విద్యార్థిదశయందు నాకుఁగల యనుభూతిలో 'అఖండయతి' విషయమున ననేకసంకల్ప వికల్పములుండుటచేత కొంతవరకు సడలింపుగనే యఖండయతి నుపయోగించితిని. నాప్రారంభ కవితకుఁగల యందచందములందలి లోపములను సహృదయులు మన్నింతురని యాశింతును.

భావతరంగిణీకావ్యము "మావాణీనివాసంబు"న రచింపఁబడుటవలన, పదునాఱువత్సరములకుఁ బూర్వమున్న ప్రతిని యథాప్రతిగఁ బ్రచురింపింప నిశ్చయించితిని. తీర్పులు చేర్పులు లేకుండఁగఁ బ్రచురింపించుటయే నాయభిలాష.

సుమారు పది పదునేను వత్సరములనుండి యుద్యోగ సాంసారికాది విషయ క్లిష్టపరిస్థితులందు నిమగ్నుఁడనై కవితా గోష్ఠికి దూరుఁడనైయుండఁగా నేటికి నావిద్యార్థిదశలోని నాటి సహాధ్యాయుల, నేటి సహోపాధ్యాయుల, తక్కటి మిత్రమండల ప్రోత్సాహ ప్రాబల్యములవలన నీ ఖండకావ్యములను బ్రచురింపింప సమకట్టితిని. సహృదయులగు కవి పండిత ప్రభృతులు నాసాహసమునకు మన్నింతురుగాత.

ఏతత్ప్రయత్నమునకుఁ జేయూతనొసఁగుచు, పూర్వ ప్రతిని ముద్రణ కనుకూలముగా జేసి ముద్రింపించిన, నాప్రేమ పాత్రులు, విద్వత్కవులగు, నాసహోపాధ్యాయులు సంస్కృతాంధ్ర హిందూస్తానీ పండితులు శ్రీ రాచకొండ నరసింహ మూర్తిగారికిని, యస్. ఆర్. ఆర్. అండ్ సి. వి. ఆర్. కళాశాలాంధ్రోపన్యాసకులు, సంస్కృతాంధ్రాంగ్లేయ భాషా కోవిదులగు శ్రీ పాటిబండ మాధవశర్మ, యం. ఏ. గారికిని, మిక్కిలి కృతజ్ఞుఁడను.

పటమట ఉన్నతపాఠశాల, మా వాణీ నివాసి

12-12-1952. సూ. నా. మూర్తి పండితుఁడు.



కృతిభర్త;

శ్రీ కోనేరు బసవయ్యచౌదరిగారు

## శ్రీయుతులు
## కోనేరు బసవయ్యచౌదరిగారి

కృతిసమర్పణ సందర్భమున సమర్పించిన

# పద్య నవరత్నములు.

శ్రీవాణీగిరిజల్ చెలంగ మదినిన్ శ్రీనాథ ధాత్రీశ్వరుల్
సావాసింపఁగ శేషజన్మ ఘటికల్ సార్థక్యమొందింప స
ద్భావానంద వికస్వరాకలిత సాఫల్యార్థ సంసిద్ధికిన్
గావంగోరెడి నస్మదుక్తి బసవాఖ్యాత్మున్ మహాధార్మికున్

నెట్టితి భోగభాగ్యముల నేర్పున వృద్ధుఁడవయ్యుఁ బేర్మి నీ
రట్టున కాట్రగడ్డ రఘురామయ, నల్లురి పాపయార్యులా
జెట్టులు తోడ్పడంగఁ బలుచేవఁగఁగట్టితి పాఠశాల నీ
దిట్టతనంబెసాక్షి వని తేకువ ముచ్చట గొల్పు చౌదరీ!

ఎంచితి వెన్నియోమదిని నెంచితి ధార్మిక సత్యసూక్తులన్
సంచిత పూర్వజన్మకృత సంస్కృతి నేటికి సిద్ధియయ్యె ని
ర్వంచన భావబోధలకు రాజిత ధీరత తోడుగా వెసన్
మించితి వర్ధ సంస్కృతుల మేలుగదా! బసవయ్యచౌదరీ!

పుట్టినవంశమా! ఘనత పూతమదయ్యెడి నీవదాన్యతన్
మెట్టినవంశమా ఘనత మేటిగవర్ధిలె నీదుజాయచే

కట్టిన యట్టులయ్యెనల కన్నులకు న్నిరుపంశజాతులున్
మట్టులవోలెఁ గోనెరెలమంచిలి వంశ పునీతకర్ములన్

తిన్ననిమించు భక్తవర ! ధీరత నిశ్చల భావకర్మ సం
పన్నకులీనతాది యలమంచిలి కోనెరు వంశనామకా
భిన్నతఁ జేసితౌర ! నిరుపేదల పాలిటి సొమ్మటంచు నీ
తిన్నని బాటఁజూపి సరిదిద్దుము విజ్ఞత బాఠశాలకున్

అక్షరలక్షలిచ్చెనని యందురు వేపురువేత్తలెన్నఁ బ్ర
త్యక్షముగాదుగా ! యిపుడు ధార్మికుఁడౌ బసవయ్య విద్యయన్
ద్వ్యక్షరలక్షయిచ్చుట నుదారత భోజునిసాటి యాటచే
నక్షయమయ్యె జీవితము నారయఁ గాంక్షలుచెల్లె నేటికిన్

నీపూర్వార్జిత కర్మభావఫలమే నిర్ణీతసంస్కారమై
నీపత్నీకృత పూజ్యభావఫలమే నిర్ణీతమాటం గదా !
నీపుణ్యంబుఫలించె శక్తియుత నిర్నిద్రాప్తి సద్వృత్తి ని
న్నాపాదించెను గావ్యకన్య బసవయ్యా ! పేర్మిఁ బోషింపుమా!

పదునాఱేడులనుండి నీకొఱకు సద్భావంబు సౌశీల్యమున్
మదిఁగాపాడుచు శైశవంబు గడపెన్ మత్ఖండకావ్యాత్మజా
త దయాంతఃకరణుండవై సుమతివై తాదాత్మ్య మొందించుకో!
అదనౌసుమ్ము! వరించెనేడు బసవయ్యా! సంస్కృతార్ధాత్మకా!

బాల్యమాతృవియోగ భారంబుసైరించి
        నాయనమ్మనుజేరి నడక నెదిగి
బీదరైతుఁగబుట్టి పేదరాలునుబట్టి
        భూదేవిచేపట్టి పొంగుఁజుట్టి

ఎండవానలకోర్చి కండరాల్ కరగించి
చెమటబొట్టుల దుడ్డు సేకరించి
కాయకష్టంబుల కనకాలఁ గరగించి
రైతుబిడ్డలదావు రక్తిగాంచి
పేదవారింటి బిడ్డగాఁ బెరిగి తిరిగి
దొడ్డవారింట దుడ్డుల దొరవుగాగ
పూర్వసంస్కారవితరణ పుణ్యభరిత
దానకర్ణుఁడవైతివో! ధన్యజీవి !



# వంశకల్పతరువు

కృష్ణామండల పటమట
జిష్ణుఁడవై పారశాల చేవగ నిల్పన్
నిష్ణాతుఁడవైతివి వ
ర్ధిష్ణుఁడ ! కోనేరు వంశదీపక బసవా !

క్షీరాబ్ధివంటి కోనేరు వంశమున నీ
హారకరుండు వెంకయ్య చెలఁగి
మీనాంబఁ జేపట్టి మేలమ్ములాడుచు
నల్వురుసుతులు సంతసముగూర్ప
రేడులేయనఁబోలు రెడ్డియ్య కిచ్చయ్య
హనుమయ్య కనకయ్య లలరవరుస
హనుమయ్య శేషాంబ నాలిగాదరిఁజేర్చి
వేంకటరత్నమున్ వెలయఁగాంచ
శ్రీయలమంచిలి సిరినొందు సుబ్బయ్య
మాలచ్చి వలనఁ గుమార్తెఁగాంచి
విజయలక్ష్మిదేవి వేంకటరత్నమ్ము
కిచ్చి పెండిలి వేడ్కనింపుఁజేయ
కనక గర్భంబునాఁగాంచ లక్ష్మిదేవి
బసవయ్యపుత్రుని భవ్యమూర్తి
వ్యయనామవత్సర భాద్రపదంబున
శుక్లపాడ్యమి దివ్యసోమవార

సోపపత్తినిఁగూర్చి నుత్తరానక్షత్ర
"శనాఁ" సుజాతుఁడై కలిమిఁబుట్టె
పుత్రుఁగన్నదిమొదల్ పోషించుభారంబు
నత్తగారికి నిచ్చియరిగ దివికి
తల్లిలక్ష్మీదేవి దర్శించుభాగ్యంబు
దూరమై బసవయ్య దుఃఖమొంది
యమ్మమ్మయిచ్చిన యావందరూప్యముల్
మామయా నాగయ్య మమతగల్గి
దరిజేర్చి పెంచిన సిరియిల్లు పెరుగుచు
పదునాల్గువందలై పరిఢవిల్లె
దానిఁబూనికజేసి ధనధాన్యసంపదల్
నలుబదియకరాల నలరుచుండె

లక్షరూప్యంబుల లాలిత్యమొలయంగ
కష్టసుఖాలతోఁ గలసిమెలసి
శ్రీయలమంచిలి శ్రీఁజెందు గోనేరు
వంశాలభాగ్యమై బసవఁడొప్పె
ఇరువంగడంబుల నేపుమీరఁగఁ గొల్వ
యలమంచిలి సుజాతయై మెలంగు
లక్ష్మమ్మనాగయ్యలతనూజయైన ల
దేవిఁజేపట్టి చెలఁగుచుండ
బసవయ్య సంసారభాగ్యరేఖలుగూడ
భార్యలక్ష్మమ్మచే భవ్యుఁడగుచు

లక్ష్మమ్మసంసూక్తి లాలించి శ్రీమించి
సంస్కారధానంబు సరవిగాంచి
ఆలుమగల్ సరి నాలోచనంబుల
విజ్ఞానసంస్కార విద్యలంది
విద్యకై లక్షరూప్యాలు వెలికిఁదీసి
యున్నతాశయ సంసిద్ధి నోర్మిమలఁగ
పాఠశాలకు భవనంబు వఱలఁగట్టి
దానమొసఁగిరి ప్రజలను ధన్యులైరి.

# సమీక్ష

శ్రీయుతులు సూర్యనారాయణమూర్తిగారు నాకు ఆబాల్యమిత్రులు. చిననాడు, ఉత్సాహము పొంగిపొరలునాడు రచించిన ఈ చిరుపొత్తమునకు ఉపోద్ఘాతము వ్రాయఁగోరిరి. ఉపోద్ఘాతమనుటకన్న, ఆనాటివారి భాషాసేవానిరతికి మారు రూపమైన యీకృతి వీక్షించి, నాకుఁ గల్గిన యానందమును వెల్లడించుటయనుట ఔచిత్యావహము.

ఇందు వివిధభావములకు రూపుదిద్ది, మంచి చెడులను బరిశీలించి, నేటికిని సమస్యలుగా నిలచిపోయినవానికి పరిష్కార మార్గము చూపయత్నించుట ముదావహము.

కర్మవు, నీతి, వరలక్ష్మి మున్నగుభాగములం జదివిన సనాతన సంప్రదాయముపై సవిమర్శముగ వీరికిఁగల యభిమానము వ్యక్తమగును.

"అడవిసొంపు" అనుభాగము వర్ణనాత్మకము. ఇందలి వర్ణనము వివిధమై హృద్యముగా నున్నది.

మచ్చునకు :—

"మలయపర్వతమందు మఁటిఁబుట్టఁగ నేర్చి వింధ్యాద్రికడకేగి పెరుగు తెరిగి"
"నందనవనమును నలఁగఁద్రొక్కఁగఁజాలు సౌందర్యమహిమ నీసుమవనము"
"ననగుత్తు లెనయంగ నెనయానె! పొన్నారు సనజాజి విరజాజిసన్నపూల"

# 2

శయ్యామాధుర్యము అన్ని యెడల ఓజస్సు, వైదర్భి, మాధుర్యము మున్నగు గుణములచే నలరారుచు, శ్రీవ్యాసు నన్నయ పలికిన అక్షరరమ్యతను స్ఫురింపఁ జేయుచున్నది.

అందము చందమౌ వసుధయందు బసందగు చందురందమే
కందము విందునొందు పసికందువమేనిపసందు చందముల్
విందము వందనీయమగు వెందవిలించుపసందు చందమౌ
చందురు బందుచంద్రు ముఖచంద్రుని యందము నందురందరుల్
కాంతురటంచు నెంతురల కంతునివింతల పంత మెంతన
న్నెంతురిదంతసంతసమదెంతని చింతల వింత పొంతలన్
బంతురుదంతమంత వెసబంతులవంతుల సంతతంచు బ
ల్వంతలజెంత సంతత మలంకృతి నెంతురు పంతమింతగా.

కొండపల్లె కొండ వర్ణనములోని సన్నివేశమును రచనముకవికిఁగల దృశ్యపరిశీలనమును, శిల్పదృష్టిని వ్యక్తము చేయుచున్నది. ఆ భాగము చదివిన కొండపల్లె నిర్మాణము కండ్లకుఁ గట్టినట్లుండుట సత్యము.

గ్రంథము తుదిదాక జాగ్రత్తగాఁ జదివిన భాషాపాండిత్యము, సమాసనిర్మాణచాతురి, వర్ణనాప్రాగల్భ్యము, క్రొత్త పోకడల ద్రొక్కఁ దలచు నుత్సాహము వ్యక్తమగును.

"పుండరీకములన్న బురదయేమియు లేదు కువలయంబనియన్నఁ గొలను లేదు
చంచలంబులటన్న స్థానభ్రష్టత లేదు మృగనేత్రియటయన్న బెగడు లేదు"

ఈపోకడ నిజముగా విలక్షణము, అన్నిటికంటె మెచ్చఁ గూర్చునది చిననాడె కలిగిన యాముష్మికతాదృష్టి, అందు లోతులనరయఁగోరు జిజ్ఞాస.

3

ఇందలి వివిధరచనలు విద్యాభ్యాసమునాఁడు విద్యాతపః ఫలముగ నప్పటప్పట, ఉత్సవసమయమున దొరలినవి కాన దోషములుండుట యబ్బురము కాదు. ఆదోషము లల్పములైనను వానిని సంస్కరించక యానాటి రచనల నారూపముననే ప్రచురించి, పౌర జీవితమునఁ దనకుఁగల్గిన పరిణతితో వెల్వడు రచనలతోఁ బోల్చిచూచుకొనఁ జూచు నాశయము పలువురకుండదు. అట్టియాశయము విశాలభావోపేతమై సంస్కార విశేషము నొనగూర్చి సిద్ధహస్తతకుఁ దోడ్పడును. నా మిత్రుడు ఇట్టియాశయముతో ముద్రణకుఁబూనుకొని నందులకు ధన్యవాదములు.

తెనాలి
15—1—53

కావూరి సుబ్బరామయ్య
ప్రధానాచార్యులు K. L. S. కళాశాల

# నా భావము.

కావ్యములల్లుటయే చిరసాధనాదుస్సాధము. అందును పురాసంపాదిత పుణ్యలేశముండక తల్లాభమసాధ్యము. అయ్యా కవుల బుద్ధ్యార్జిత కావ్యత్వ సంస్కార పరిమితులనుబట్టి తత్సిద్ధి ప్రవ్యక్తమగును. కావ్యత్వము బుద్ధిమాత్రనిష్ఠమైనపుడు కవులకును, సహృదయులకును భేదముండదు. బుద్ధిగతమైనది శబ్దనిష్ఠిత మొనర్చినప్పుడే సహృదయుఁడు కవియగుచున్నాడు. అతి క్రాంతదర్శిత్వము లేక "కవి" త్వము లభించదు. బాహ్యాభ్యంతరములయ్యు సూర్య తాత్కాంతులవలె నపరిచ్ఛిద్యము లైన శబ్దముల యర్థముల యైక్యసిద్ధి కావ్యమగును.

ప్రబంధకావ్య, ఖండకావ్యములయందు ద్వితీయమున నొక విశిష్టసాధన యనివార్యమైయున్నది. ప్రబంధగతేతివృత్తమే రసోత్పత్తికివలయు క్రమము గలిగియుండును. ఖండకృతులఁ గథాప్రాధాన్యముండదు. మహానదుల కుపనదుల వలె వచ్చి కలియు దోహదసామగ్రియు ప్రబంధమునందువలె ఖండకృతి నుండదు. ఇది శాఖా రహితమగు వృక్షమును బోలినది. ప్రబంధ ముపవనము వంటిది. ఈరెంటికిని నేవంవిధములగు నసామ్యము లెన్నియో కలవు. ఖండకావ్యసృష్టి నిశ్శిల్ప కనక ఖండ

మును తళత్తళమను మెఱుగుదిద్ది శిల్పకృతి యనిపించుటవంటిది. పాశ్చాత్య భారతీ మందిరమునను ఆంగ్ల సాహితీ సదనమునను ఖండకృతి ప్రాచుర్యమున్నది. వారందరును ఆర్షకవుల కోవ లోనివారు.

"భావతరంగిణి"యను నీఖండకృతి సంపుటము మన్మిత్రులు మూర్తిపండితులు సహృదయ లోకమున కందించు చున్నారు! "కావ్య" త్వమునకు, "సహృదయ" త్వమునకును సైతము—వారి వారి సంస్కార పరిమితులనుబట్టి—పరిమితులుండును. ఈ రెంటికిని శృతిగలసినప్పుడు గానమాధుర్య మవగతమగును. "సహృదయాః ప్రమాణం"

రా. స. మూర్తి.

20—1—1953 విజయవాడ

# శ్రీ సూక్తి.

శ్రీరంజిల్లఁగఁ జిద్విలాస విభవా
శ్లేషైకసంప్రాప్తి శ్రీ
కారంబుల్ వడిగల్గ భాసుర నిరా
కారంబు సాకార స
త్సారూప్యంబు ఘటిల్ల భావలహరీ
సంసూక్తి సంపత్ప్రదా
కారాన్వేషితుఁడై జగమ్మునకు సదా-
కారుండిడున్ భాగ్యముల్.

ఒకనుడి చెప్పిన దాన
న్నొకచెవిలోఁ బడఁగ నంతనొచ్చు మనంబుల్
సకలంబుఁ గలయఁ గూర్చిన
నకలంకత ముప్పొలుఁడ ననుభవమందున్

లోకైక - ప్రకృతిఁ గనినన్
సాకార వికారరూప సాయుజ్యంబుల్
ప్రాకృత ధర్మాసక్తిన్
శ్రీకారమునై వెలుంగు సేవానిరతిన్

# పరంజ్యోతి

ప్రాకృత ధర్మసంభవమునై విలసిల్లు
బ్రకృతి చరాచర భరణచయము,
చిచ్ఛక్తి సంయుక్తి సేవానిగూఢైక
శేషసంపాద్య సంశ్లేషపథము
ధీ ప్రకాశారూఢి ధీరభీకరయుక్తి
సహజసాత్వికభావ సరసభవము;
నిత్యసత్యాశ్రయ నిర్నిద్రసంవేద్య
మానసంయోగ సంపాద్యశుభము
ధ్యానయోగ్యతాసంభవ దాంతి శాంతి
సత్యనిష్ఠాగరిష్ఠమై సౌఖ్యప్రదము
దోషరాహిత్య సంశుద్ధ తోషితాత్మ
చిద్విలాస పరంజ్యోతి సేవ్యపథము.

# ధ్యానము

శ్రీరామం కరుణాకరం శుభకలాకారం పరం ధార్మికం
జానక్యాః పరిషంగఘుష్మలవ సాన్ద్రాకారవాసం విభుం
నిత్యానందకరం సదాఽఘురహితం సీతామనోరంజకం
పాపోఽహమ్ ప్రణమామి భక్తసురవృక్షమ్ లోకరక్షాకరమ్.

లోకాభ్యర్చిత పాదపద్మయుగళం మానీంద్ర సాక్షాత్కృతం
కుక్ష్యభ్యంతర సర్వలోకకలితం సాధూన్ సదారక్షకం

శేషాహీంద్రశయాన మన్యవనితా వైముఖ్య మాప్తోదయం
క్షీరాబ్ధేస్తరణం కలావిలసితం శ్రీశం భజే వైష్ణవం.

సాలంకార సుహాసినం సురగణాధ్యక్షం హరిం శ్యామలం
నానారూపధరం ధరేణసకలా రాతిక్షయం కారకం
ఆర్తత్రాణపరాయణం భవపయోధ్యుల్లంఘకం రాఘవం
భావాతీతనరం పరం గుణవరం శ్రీరామచంద్రం భజే

శ్రీమచ్ఛబ్ద పదాళీ పాపహరణం పద్మామనోనాయకం
కష్టానేకజనాళి రక్షణపరం శ్రీశం కృపాసాగరం
దుష్టారాతిదశాననాది హరణే సార్థక్య సంపాదకం
కాలాతీతపరం సదాశివకరం శ్రీరామచంద్రం భజే.

## స్తుతి

సాలంకార రసాధికేన కలితాం వాక్యార్థ విస్ఫూర్తితాం
శబ్దార్థైరసలుంఠనైః ప్రవిరలై ర్భావైశ్చయుక్తాం సతీం
భావానాం రసడోలికేషులుఠితాం విద్వన్ముఖే చారిణీం
వాణీమంజలినానమామి సకలాం లోకైకపూతాం సతీం.

## నమోవాకము.

శ్రీవాణీన్మదినిం డలంతు సకలాశేషాఘ నిర్మూలనన్
భావానందిని భాగ్యదాయిని విభావారాధ్య సద్రూపిణిన్
శ్రీవిష్ణ్వాదయగర్భజాతసతిసన్ శ్రీయుక్తసద్భారతిన్
భావంబందుఁదలంతు వాణి విధిగీర్వాణేశ సంపత్ప్రదన్

శ్రీవాణీ పదసేవ జన్మనిరతా సేవాత్మ ధన్యత్వముల్
ఆవాసంబుగఁ గొంచు భక్తివశత న్నాద్యంతముం బొందు నా
శ్రీవాసుండఖిలైక భాగ్యవరముల్ ప్రేమానురక్తిన్ సదా
భావాకల్పిత కామమానుఁడగుచున్ భవ్యంబుఁ జేకూర్చుతన్

వరభావంబుల నాత్మతృప్తిపడఁగా భాస్వత్ప్రభాజాలుఁడై
వరదేశుండల రాఘవుండు సతముల్ వాంఛాకృపాళుండునై
భరితాశేష విభావముల్ గలుగఁగా భాగ్యోదయంబేపుగాఁ
గరుణాళుండయి యిచ్చుఁగాత నిజభక్తారామసంవర్ధికిన్

వాక్కున వాణియున్నది అపారభుజంబులమాత లక్ష్మిసొం
పెక్కఁగ నిల్చియున్నది పరేంగితభావిత మానసాబ్జమం
దెక్కఁడు బ్రహ్మయున్నది యహీనవిభావ సుభాగ్యరత్నముల్
చక్కఁగ నిక్కియున్నవి విచారమదేల ! హృదంతరాళమా !

పుట్టి నశించు జీవితము భోగములేల ! సుధార మెంచినం
బెట్టిన తేనె తెట్టవలెఁ బెంపువహించి నశించు సంతలో
గట్టిన బంధమేయిదియ కాయము నిల్చుటకై యదేగినం
బుట్టలవోలెనున్న పెనుభూతధనాదులు గట్టుబంధముల్

కలము వడంకె వాత నుడికారము వెల్వడుచొప్పడంగె భా
వలతల పుష్పమోదఫలభారములొందుదమన్న వెఱ్ఱియై
కలఁతఁజెలంగె నేమిగతి ! కాయము నిల్పినఁ గాయమామువే
పులవల వేధఁజెంద నిక భావముదొప్పదు నిల్వఁగానిలన్



# తొలియల

మా వాణీ నివాసము

శ్రీ ధాత వత్సర
దేవీ నవరాత్రములు.

# మా ని వా స ము

అమరులు గొల్చుచుండ నమరావతి నాథుఁడు పాదపద్మముల్
విమల మనంబులం గొలువ వేదవిదుండు శివుండు పక్కలం
దమకమునన్ విహారముల దండల దీర్చుకకూడి వేడుకం
గొమరున విష్ణుమూర్తి రమఁగూడి ప్రజావళిఁగాచుఁగావుతన్

## ఏ కాం త సే వ

చేసితి ఘోరకృత్యములఁ జేసితిఁ బాప విశేష దుష్కృతుల్
చేసి మహాపరాధములఁ జేకొని తత్ఫలహీన దీనముల్
చేసితి దైవదూషణముఁ జేసితి దొంగలఁగూడి చౌర్యముల్
చేసిన యిన్నిఁబాపి దరిఁ జేర్పుము దీనజనావనీ! రమా !

నిలిపితి ద్యూతకారులను నేస్తునఁగూడితి మద్యశాలలం
బలికితి దుష్టవాక్యములఁ బాసితి సజ్జన పూరుషావళిన్
గలిసితి దుర్మదాంధులను గాపురుషావళిఁగూడి యాడితిన్
సలిపితిఁ గాన దుష్కృతుల సజ్జనుఁ జేయుము తల్లి ! శ్రీరమా

కామితకాంక్షలన్ నెఱపుఁ గార్యవిశారత డెల్పఁ బూర్వపుం
బాములఁగన్న పాపములఁ బాపికృపామతిఁ గావుమమ్మ ! నా
తామసముం దొలంగుటయు ధాన్యధనాదులవృద్ధిఁ జేసి ల
క్ష్మీ! మమకారము న్నిలిపి కీర్తి విశాలునిఁ జేయు శ్రీరమా !

కమలనివాసినీ ! సకల కామితదాన విధాయినీ ! కలా
విమలయశస్వినీ ! కరుణఁ బేదలగావుము కల్పదాయినీ !

సుమతివిశాలినీ ! సతత శోభితమంగళ సౌఖ్యదాయినీ !
సుమసుకుమార పల్లవిత సుందరగాత్ర కళైకభామినీ !

వచ్చితిఁ బ్రోవుమంచు నిను వాంఛలఁ దీర్పుము భాగ్యదాయినీ !
తెచ్చితి పుష్పగుచ్ఛములఁ జేటగ నీపద పద్మపూజకుం
బుచ్చితిఁ బ్రాణమానసములఁ బోడిమిసంపదఁ గోరుదంచు నా
పచ్చని యిల్లునిల్పుమని పల్కెదు నీకువె భూరికాంక్షలన్

పరమరహస్యముల్ విదుల పాలిఁటిసొమ్ముగదమ్మ ! భావనా
వరములు మీపదంబున నివాసము సల్పుగదమ్మ ! లౌకికాం
తర కరణీయముల్ కలిగి ధార్మికబుద్ధి విశేషముల్ యశః
కిరణతరంగముల్ మిగులఁ గీరితిదెచ్చుగదమ్మ ! శ్రీరమా !

నిను గొలువంగఁ జేరి రజనీకిరణంబుల చాటునుండి నె
మ్మనములఁగుంది కుంది పలుమారుజపించి విరక్తిజెంది నీ
వానరఁ గృపాళిఁ జూప మన మొందెడి సంతసముబ్బఁజేసి సాం
త్వనవచనంబులూరఁ గడు ధన్యతనొందితిఁ బుణ్యభామినీ !

మానము వోయెనంచు నినుమంతఁ బరాకుపడంగనీకని
న్మానసమందుఁగొల్చి కడు మన్నన చేయగ వేడివేడి సం
తానద్రుమంబు మూడ్కగని తాలిమినొంది జపించి మించి పెం
పీనిన సౌఖ్యసంపదల పేర్మిని నొందిరి మానజీవకుల్

ఆరమణీలలామ సువిహారము లొందుచునుండ నూటిగా
జేరఁగరా, భయంపడియుఁ జెట్టులమాటున డాగియుండి సొం
పార రమాలలామకిట, నాదరపూజలఁగొల్చి భక్తిమై
వారితగర్వులై బుధులు వాక్కులఁదెల్పెడిఁ గోరికల్ వెసన్

లలితలతానికుంజముల లాలితమారుత మాంద్యముల్ వెసం
గలిత సుఖాంబుధిన్ విసరుఁ గాలగతిన్ సమకూర్చుదోఁటలో
సలిల కృతావగాహులయి శాంతిని దాంతిని ధీయుతులై భవ
త్కలితమనస్కులై యతినికాయము గొల్చెడిఁగంటె! శ్రీరమా!

మునివరులొక్కటంగవిసి ముప్పిరిగొన్న లతావితాన భూ-
వనమునఁ జేరి భక్తులొక వావిరిఁ దీవహాజల్ మఱుంగుగా
గని నిజపీఠముల్ నిలిపి క్రమ్మినబుద్ధిమనః ప్రభాసకే-
తనఁ బరమేశురాణిమదిఁ దాల్మి జపించుచునుంద్రు శ్రీరమా!

కమలా ! లౌకికవాంఛల-
శమలా ! భవదీయపూజఁ గాంక్షింపగనే
విమలా ! వరములనిచ్చితి
వమలా ! పదపద్మపూజ లందుటవశమే !

కాలగతుల్ వడిందిరుగఁగా నిలఁజంద్ర దినేశులేర్పడం
బాలకరక్షకత్వముల వావిరి దాల్చి జనంబుగావ సం
లాలనఁ బంచభూతములు లావెసగం బరివృద్ధిఁగావ ల
క్ష్మీలలితమ్మ భర్త పరిశీలనసల్పి జనంబుఁ బ్రోచెడిన్

ధనకనకాంబరావళియు దాలిమిబోడిమి గల్మిసంపదల్
వినఁగన నీలసౌధములు వీచెడి చామర పద్మజాలముల్
వినయ విహారసీమలును నింపులఁగొల్పు లతావితానముల్
గనియు గృహంబుసుమ్మ తమకంబుల వాడ వనంబు లక్ష్మికిన్ ।

అని కొనియాడి లచ్చిఁ బరమాదర ముంపగ సుప్తిఁగాంచి వం
దనశత మాచరింప నను దాలిమిఁ జేరగదీసి దీవెనల్

పెనుపుఁగనిచ్చి సంతసపుఁ బెంపెసలారఁగఁ బుజ్జగించి యం
బ్వనజ దళాయతాక్షి నవపద్మనివాసిని ప్రేమసిల్లనుర్
వరగుణధుర్య! నీమనము వంతలఁ జెందుటగాంచి దేవతా
వరులు మహేంద్రవర్గమును బాపురె! దీనతనుంటగాంచి ప
ల్మరు భయమొందుచుండ నట మాధవపద్మజశంకరుల్ తపః
పరవశులై తపోమహిమఁ బర్విడఁగాంచిరి నీదుచిత్తమున్

కదిసితి నంతవేగ నిజకాంతునిఁగాంచి తదీయ భ్రాంతులన్
మదిఁదొలగించి భక్తిఁగనుమా! యిదియేమి? విచిత్రమంచు నా
చదువుల వేల్పుటెంతిఁగని శర్వభవాని గణేశుఁజూచి యు
న్విదిత మొనర్చితింకమది వేదన నొందగనేల పుత్రకా!

— (౦( —

# విలాసము

శ్రీరమణీలలామ! సరసీరుహలోచన! పద్మనాభసం
సారవిశేష ధూర్వహణసంకుల మానసరాజ్ఞి నామనం
బారసి భావవీథిఁ గరుణావళిఁజూచి భవాబ్ధిదాటస
త్కారముసల్పుమమ్మ! భువి, ధాన్యశుభోదయభాగ్యదాయినీ!

అలవైకుంఠపురంబటుండఁ బరమాహ్లాదంబు శూన్యంబు ని
ర్మలహోమాది జపంబులెల్లఁజేసి సంపాద్యంబులై భారముల్
జలజాక్షేక్షణు రోగదృష్టిగను నాశాంతాత్ములంజేర నా
తులమొందంగ కుటీరపాళి నటనాకుంజెప్ప నీయున్నతిన్.

ప్రకృతినైసర్గిక భావపరంపర
పావన శ్రీయుత భాగ్యముంట
పంచభూతంబులఁ బార్థివజాలంబు
సకలభిన్నత్వంబు జాతిఁగంట
పాల్లోకములఁ గెందు మోదపుంజము, లోక
సంపదల్ సౌభాగ్యసౌఖ్యముంట
ఆయురారోగ్యాది యాచకదానాది
కష్టసుఖంబులు కలిమి లేము
లందుటం బ్రకృతస్థితి నాశ్రయించి
పరమకళ్యాణ సంపత్తు భాగ్యగరిమ
పంకజాక్షి ! యంభోజ నివాసినీ ! మ
దీయ కాంక్షల నెరవేర్పు తేటఁజూచి.

జీవయాత్రల దేని సేవించి కడుభక్తిఁ
బిసినిగొట్టుదనంపుఁ బేర్మిఁగంటి
భవపయోధిని దేనిఁ బటుభక్తిఁ దేలించి
పరపీడనంబులఁ బ్రాపుఁగైతి
సౌఖ్యవేమల దేని సతతమ్ముఁ బ్రేమించి
జారచోరాది వ్యసనముగంటి
పానయోగ్యము దేని వరియించి ప్రేమించి
మద్యపానాదుల మదముగంటి
నేటిగతిఁ గాంచితే ? తల్లి ! నియతివిడిచి
దేశకాలవిశేషంపుఁ దేటలెల్ల
ప్రతిపద విపరీతాస మత్వంబుగాంచు
సజ్జనారుల కేలుండు సాధుపథము.

నిన్నునమ్మియకాదె ! నిక్కి నీల్గుచు పెద్ద
పిన్నలారయ నేరఁ డెన్నఁడేని
నీచనవునఁగాదె ! నీచులవలెఁగాంచి
మెడనెత్తి క్రిందికి మెదపలేడు
నీవుండుటయకాదె ! నివరిసస్యంబుల
పనిపాటజోలికిఁ బర్వలేడు
నీవుగనుటగాదె ! నిఖిలభూతంబులఁ
గాలిక్రిందటఁబెట్టి కదలనీఁడు
కన్నుమిన్నులుదెలియక క్రౌర్యమూని
మానిసిర్మాని నొక్కట మాడ్చిమాడ్చి
భువనత్రయమును జాలుపఁబుట్టి తనుచుఁ
దన్ను దేవాంశునిగ నెంచుఁ దామసుండు.

దివిజవరాఖిలార ! విధితేజము నమ్మి యశంబునొంద శు
ద్ధ విషహితాశయంబుల వితాకువిడంగ వివేకశౌర్య ధై
ర్య విభవశాంతి దాంతుల నయాచితవాంఛల సంతరించి సం
భవితమనఃప్రబోధముల వందన పూర్వకపూజసల్పుమా

పలుమరు నన్నుగావ వరపావన భాసురమైనజోతినా
పలుకులధైర్యముంచి పలు పల్కుల మీకు ప్రబోధమేర్చి యి
పలరఁగఁదెల్పమోదమున వాంఛలనిత్తుమటంచు వేగ సం
ఫలితవరంబులిచ్చి వర భావనఁదెల్పిరిగాదె ! వేడుకన్

మిమ్ముఁజేరంగ తరంబునొందకయు, గాంభీర్యాది ధైర్యప్రభా
వము మందాత్ముల భావవీధిఁగటా! వశ్యైకనఁగాన్పించునే!
భ్రమకాదే! పరమాత్ముఁజేర వలపా! పాపాత్ములెందేని భా
వములం గోర్కెలనింపుమీఱుటయె! భావానంద మిట్లుండునే!

పలుకుల తేనెబొట్టుల విపాకముజేసి సుధావిభావముల్
పలపలజల్లియుండు పరమాత్మవరంబుల నానబెట్టి సం
కలితమనంబునం గలిపి కాంతిసుబోధిని జోతినుంచి సృ
ష్టిలయశుభాది పోషణల జేయుటకుక్ వరశక్తినిచ్చుతక్

బ్రహ్మావిష్ణు మహేశ భారతీ శ్రీరమా
హైమిత్రిమూర్తు లందావరించి
ప్రకృతిసిద్ధల సర్వ పంచభూతంబులఁ
దత్కృతభూతాదిఁ దాండవించి
జీవనాధారమై జీవనవాయ్వాది
ఘటపటాదులయందుఁ గరిగిమెఱఁగి

ప్రకృతి భాసురసుందర రాజ్ఞివోలె
భావవీధుల గాత్రసంవాసములను
నాత్మగతముగఁ జేయుచు నంశమంపి
కలిపి నటనలీలల జూపు కాంతిజోతి

లోకగతంబుఁగాంచి వరలుల్లము సంతసమంద భావిశం
కాకరముల్ విశేషముగ గౌరవమానసుఖైక శాంతులక్

వాకులఁ దేనెలొల్క వరభావపరంపరలిచ్చి మందహా
సాకరయై నిజాననవిశాలతఁ బల్లవితాధరోష్ఠియై

పలుకు వియన్నదీమధు-ప్రవాహసువేగమహోత గంటయై
కలకలమోగఁ జెప్పెనిటు కాలగతుల్ మిటిమీరి పాపసం
కులములుగాఁ దొడంగెఁగలికుట్రయొ మానవకుట్రయో! మృగా
వలికృతతంత్రమో! ప్రకృతిభామినిచేష్టయొ! యేర్పరింపుఁడీ!

దేవగణంబులార! వరదేశ్వరులార! సురాంగనాప్రభా
దేవతలార! మర్త్యజగతింగల వింతలఁ దెల్పలేరె! మీ
పావకవాయువార్తల యథార్థములం బరికింపుఁడీ! ప్రజా
భూవరపుంగవుల్ గలరె! భూమిని గల్గిననిట్టి చోద్యమే!

భూలోకసంచార మూహించి రాగనే
మానవజాతుల మతులు దెలిసె
మృగజాతినీక్షించి మెప్పులఁ దెలియంగ
నన్యోన్యమైత్రి కాహ్లాదమొందె
జలచరభూచర సకలసంఘజయంతి
కాత్మసంతృప్తి కాహ్లాదమొందె
భూరుహసత్వాది భువనసంసర్గసం
భూతికెంతేని సమ్మోదమొందెఁ

బలుతెఱంగులఁ జింతించి మానవాది
మనసులందలి భావముల్ మదినిఁదలఁప
వింతలయ్యెడి భూలోకవేషములకు
మనసువచ్చనె మనుజుల మనముఁదెల్పు.

పరగుణభావసంపదల భావవిశుద్ధిఁగనంగలేదు సం
వరణకులీన జాతుల సువాణి విశుద్ధియు నొందలేదు సం
స్ఫురణ ప్రజాళిసీమల వికాసవిశేషముఁ గానలేదు సా
గరతతివోలె గుంభనలఁ గానఁగలేదు గభీరచిత్తులన్

తుస్సునమీఁదఁబర్వఁ బడద్రోయుఁగఁ జెచ్చెర మండుచుండుఁబో
బుస్సున హుంకరించుఁబడ మోదినఁ బీనుగునట్లు నుండిసూ !
కస్సునఁ గాలుద్రవ్వఁగడు గాటము దన్నిన జాఱుచుండు నీ
కస్సును బుస్సులేటికి వికాసముఖంబుల మెల్గఁగూడదే !

చాటునఁ జచ్చియుండు ధన సంఘములం దన బీరముల్ గనున్
మాటుననుండు జఱ్ఱఁగను మాటలధైర్య-ప్రగల్భముల్ బడున్
వాటుఁగ దప్పుచుండు వనవాటిక శాంతము మూర్తిఁజేయు ని
ప్పాటులవేల ! జీవనపుఁ బాటుల కింతనికృష్టమయ్యయో !

సోదరాడుల నమ్మను సుగుణపుంజ
భార్యనమ్మను పరభామ పాదదాసు
లగుదు రింతియు మనుజాధమాళిఁ దెలియ
మనఁగవచ్చునె ! నీచంపు బ్రదుకుఁ దెలుపు.

మనసు లసూయఁజెందుఁ బరమానసభావవిగూఢవృత్తులం
దనియు సహింపలేరు సరదాగుణవృద్ధిని నోర్వ భావనా
వినిమయ మొందలేరు ప్రభువీరులఁ జేరఁగనెంచి జీవితం
బనయము దాస్యవృత్తికిఁ బరాత్తముఁజేయుదురింతె మానవుల్

మనమెరియ విచారమదమత్సరత్వముల్
విరుగఁజెందగనీరు ద్వేషభాష

కుటిలమార్గమందుఁ గౌటిల్యగతినొంది
పాపజాతివోలెఁ బరగుచుంద్రు

భయము నీతి శుచియు భక్తిభుక్తంబులఁ
బరమశాంతిదాంతి భవ్యవిధుల
వినయ సుగుణబుద్ధి విత్తసత్యంబుల
సరగుజేయు రెండుఁ జపలమతులు

ఒరులను నుక్కిరి మనకయె
యొరులను జూడంగనీక యుక్కడగింపన్
బరహింసాపరు లెచ్చటఁ
బరహితగుణజాలమందు వరమతులగుటే !

మానముగావుము తల్లీ !
ప్రాణముగావంగ వలదు ప్రాణముకంటెన్
మానమె యధికంబందురు
మానిత విధివేత్తలెందు మానవజాతిన్

ధనము గడింపభక్తిపర తంత్రప్రభావముఁజాటి సుస్తుతుల్
యొనర నిజాపరాధముల నూర్పుల వెల్లడిఁజేసి పాసిపో
వినయభయంబు దోప వరభక్తులవోలెనటించి మానసం
బనిశము పేడ్కఁజెందఁబలుబాములఁ జెందినయోగ్యులౌదురే !

దీనముఖంబుఁ జూపి పరతెంచుభయంబు నయంబుఁజూపి సం
లీనపదంబుఁ జేరివిధి లీలలనన్నిటిఁ జేతఁజూపి ప్రా
ల్మానుతనంబుఁ జూపి పలుమాటలచేటలఁ జిక్కి కల్లసా
ధీనమనస్కులై యధికదీనతవేడుదురెల్లప్రాణులన్

అంతియకాదు ప్రాణముల నాహుతిజేయుదురగ్నిసాక్షిగా
సుంతయు సిగ్గులేమి వరమూర్తుల నేర్చినటించి పిమ్మటన్
వింతల నేకముల్ సలిపి వేదనబెట్టిదముల్ ఘటించి ప
ల్వంతలఁ బెట్టుచుందురు వివాదమనస్కులు సజ్జనావళిన్

మతావేశము

వేదవిరుద్ధముల్ పనులు వేత్తలదూషణ వాక్యముల్ క్రియల్
పాదవిఘాతముల్ విధులు పాపపుజాతి నికృష్టవృత్తముల్
వాదవివాదముల్ గతులు వాంఛితముల్ పరభామఁగూడుటల్
జూదముచౌర్యమున్ వలపుఁ జోద్యములంతట మద్యపానముల్

పరపాండిత్యము శూన్యమయ్యెనకటా! ప్రాణాశలెన్నాయెఁగా
పరపాండిత్యము పాటియయ్యెనకటా! భాషాదివేషంబులే
పరిపాటైనవి దాస్యభావపువిధుల్ భాషామిషావేషముల్
సరిభాగ్యాత్త పరాసులైరి పరదేశాభీష్టసంవర్ధకుల్

పరభాష పరహింస పరవేష పరభావ
    పరతృష్ణలాశించి పర్వుచుండ
నిజభావ నిజజాతి నిజవేష నిజభాష
    లార్జింప రోతఁగా నవనిఁదలప
పరజాతి నరజాతి పరభావములచేత
    నైకమత్యమువీడి యీలమాడ
మనుజభావంబుల మరచిపంచములంచు
    హరిజనమ్ముల మాలలందుద్రోయు

నంటరానితనంబు మహాంధకార
పటలజటిలమై బుద్ధి దుర్భావములను
జొచ్చికలహాశనంబులై రచ్చమీద
విఱ్ఱవీగెడుఁ దిరుగుడు వెండ్లిపోలె.

వేదప్రమాణంబు వివరించి తెలుపరే!
ఋగ్వేదభాష్యంబు ఋజువుపఱచు
బ్రాహ్మణారణ్యక ప్రభవస్మృతుల్ తుల
తూగుటే సరిపద్ధతులనుజూప
గ్రాంధికంబులు లోకకల్యాణ కరములే!
కాలరీతులమార్పు కలుగుచుండ
నాదరపాత్రము లభివృద్ధిభావముల్
గ్రాంధికంబులఁ జాలగలవు విధులు
ప్రకృతిఁగీర్తించు విషయంబుఁ బదిలపఱచి
మధ్యఁదీర్పుల నిచ్చిన మనువువాక్కు
లంతరించుట మేల్మిలు హాస్యకరము
మానవాస్పృశ్యతఁ దలంప. మనుజువశమె!

మనుజులభేదమెంచి పరమాత్మఁదలంపఁగఁదామె దక్షులం
చును సహానాదికంబులను జూపగలేమి విశేషభావముల్
వినఁ గనలేక వేదముల వీధులఁదెచ్చినఁ బాపమంచు నె
షన్మనములఁ దోచులోకులకు మానుగనేర్పిరి శాస్త్రపద్ధతుల్

హరిజనసంఘముల్ వెలి ననాదరభావములన్ బహిష్కరిం
చిరి పరమోహకారకులు చిన్నదనంబున దోసిలొగ్గి పెం

పరి వెతఁగుంది భీతిమెయిఁబక్కల నొక్కుచునుండఁజూచి యీ
వరనరజాతి సంఘమెటు భాగ్యవిధాతకుఁ జెప్పనెంచునో

హీననికృష్టపద్ధతుల నీహితజీవుల హింసఁజేయుటల్
పాన-క్రియావిశేషముల భాషలఁ బామరవాక్యముల్ కలా
స్థానములంబఠింపుటలు ధారుణిఁబండితగోష్ఠులందు భా
షానవపద్ధతుల్ కనఁగ జాలకయుండుట భూరిదోషముల్

ష్టాపమొకింత భావములఁ బారగఁజూచి విపక్వసిద్ధులం
బాపి యసత్యసత్యములఁ బాడుగఁజేసి మనంబునుమ్మ! శం
కాపదమందు నిశ్చయవికాసము గొల్పును మానవాళికిన్
పాపవిభీతులన్ వికట భావపరంపర లుప్పతిల్లునే ?

ధర్మవిదుల్ విధానములు దండుగలే! యటయున్నఁగాదు ని
ష్కర్మములందు ధర్మవిధిఁ గాంక్షలఁదీర్పఁగ సమ్మతంబులా
మర్మము వీడి సర్వజన మాన్యతగాంచుట ధర్మబద్ధ మీ
ధర్మువుగాంచుఁడీ! విబుధధన్యులు కక్షనశింపఁజేయుఁడీ !

అంటఁగరాని హేయముల నంటుచునుండుటె! కల్మషాదుల
న్నంటుఁగఁజేసికొంటె! పరమాగృతి దూరుటె పాడుకొంపలం!
వెంటఁగూరుచుంటె! పడి వీధులవాడల వేశ్యవాడలన్
జంటలఁగూడియుండి మధుశాల వినోదములన్ భజించుటే ?

పాండు జాడ్యాదిక వ్యాధిభేదంబులు
        పరజనంబులఁజేరి బాధనొంద
సంసర్గపానాది సహభుక్తిభేదముల్
        వీరశూరుల కాయ పీడఁజేయ

పాదరసార్కకాంతాదిభేదంబులం
బరవస్తులోహముల్ మార్పునొంద
పరమౌషధులభేద మరయంగ మూలికల్
జనజాతభయములఁ జంపుచుండ
వాని వేనిని గాదని వగచి పేద
బీదవారలఁ బెద్దరోయు భీతిగాదె!
పరమకల్యాణ వ్యవసాయ భక్తతతుల
వేరుజేయుట పాడియే! భేదబుద్ధి.

స్మృతుల నాధారమొనరించి మేళవించి
మాలమాదిగ బేరులం బంచమాభి
ధేయముంచుట హైందవదేశజాతి
కరయ హైన్యంబు దూష్యం బనార్యపథము.

పరమబోధల లౌకిక భక్తిముక్తి
భాగ్యమొసంగుట గర్వంబుఁ బాపభీతిఁ
బారద్రోలుట శ్రేయంబు పరమమతుల
వేదచోదిత గుణములు వెలయుఁగాత.

## వాణీ నివాసము

అలసితి వేచివేచి దరహాసమొకించుక లేమి వీడకీ
విలసిత మానసాబ్దము వివేకముడిగ్గి విశేషపూజలం
గలకలమై నభంబున వికాసవిహీనతఁ దెల్లపోయెమి
న్నుల ఘనపుంజదుర్దినస మాకస మల్లెడి నీలవర్ణమై

## వాణీ విహారము

సరిగమలన్ విశేషకృతి సాగరవీచికలన్ నిజాశయా
కరవరగీతముల్ హృదయ గహ్వరసీమ సుఖేందుదీపికన్
కరజలజాంగుళీక పరికల్పిత కీలితరాగజాల సం
కరపరివేష్టితంబునయి గానమొనర్చుచు నుండునంతలో

ఎక్కడనుండి వచ్చెఁదరళేక్షణ యీనిజ కిన్నరస్వరం
బెక్కటిఫక్కి నొందెనొకొ! యిక్కలికాలపు హావభావముల్
పిక్కటిలంగ బూదిమెయి బిప్పిఁగఁజేయు విశేషభావనల్
అక్కజమొందఁ బూర్వప్రతిభావళి హెచ్చె నిజాశయంబులన్

వలువపడంతి భావహాసనంబున హంసకు బాటఁజూపి యీ
కలిమహిమంబుఁ గాంచ భువిఁగాన్పుచుఁ దుంబుర నారదాదిసం
కలితవిహారమొందుచు నగాధ రసాంచిత భావగర్భ సం
పలిత విశేషమైతరలెఁ బార్థివలోకముఁ గాంచవేడుకన్

పరమభాగవతోత్తము భవ్యచరితు
నిరతలక్ష్మీ సరస్వతీ నియతిదీక్షు
మాతృమావాణు లంతరాత్మలఁ జెలంగు
భువన సత్కర్మచారు శ్రీమూర్తి డాయ

## బతుబతి

అమ్మా! చదువుల తల్లీ!
కొమ్మా! మాబోంట్ల విందు గూడదె! చెపుమా!
ఇమ్మా! నీదయ, చిలుకో
యమ్మా! కవితామృతంబు నాదృతి నాపై

కోపంబేలా ! నాపై
పాపఫలాంతంబు నీ భవాబ్ధి ఋకేలా !
తాపజనకంబుగాదే !
కాపాడెడి బరువునీదె ! కాపురుషాళిన్

కోవిద విదగ్ధులెంతయుఁ
భావన మొందంగ వాణిఁ బరిణతభావన్
భావిత సంగీతాధిక
ధావన సాహిత్యరసము తరలునుగాదే !

విద్దెలబద్దీ ! చదువుల
సుద్దీ ! వేలుపుల మున్నుపలుకుల హద్దీ !
ఎద్దీ ! తలఁపుల పడఁతీ !
ఉద్దులు సరిగలరె ! నీకు నువిదరో ! చెపుమా !

నిను గొనియాడుచు నుండఁగ
గనికర మిసుమంత లేక కాంచమి తగవే
పనివడి కొల్చెడి నోజల
నోనరంగాఁ గావుమమ్మ ! యొజ్జపడంతీ !

నీబత్తులు నెమ్మదిలో
నాబత్తెము లన్నివీడి యాహ్వాతి జేయన్
ఈబుత్తులు నీముత్తులు
నాబత్తులు నోనరఁగూడ వయ్యెందల్లీ !

నెలఁతుక ! తలఁపులబంతుల
పొలఁతీ ! పలుమాటలేల ? పూలవలంతీ !

వలఁపుల బెమ్మపడంతీ !
విలవిలఁ జూడంగనేల ! బెమ్మవలంతీ !

అంచ మును దారిదీయఁగ
నంచల నంచలనుగూడి యంచల తేఱా !
సంచారము చేయుచు మా
పంచల కరుదెంతు మాదు పాలిటి సొమ్మా

నినుజూడ వేడుకయ్యెడు
మనములఁగల కోర్కెల్ల మన్ననఁజేయన్
తనతరము నీదుతరమును
ననుకొనఁ దరమౌనె ! యేరికైనం దల్లీ !

పలుమాటలేల ! మామన
ములగలఁ గోరికలను దలఁపుల పరికింపన్
తిలకింప నీకెశక్యము
మలయుంగా దీన జాతి మసలెడి భామా !

అనుచును బలుకుచు నయభయ
వినయము లెసగంగ వాణి విజ్ఞకు మ్రొక్కన్
కనికర మేపుం జూపుచు
వనజాసను రాణి గని యపారకృపాళిన్

వరమతి

వత్సా ! యేమిది ! నీవిటు
లుత్సాహం బుడిగి యొంటి నుంటివదేలా !

సత్సాంగత్యము వరసం
పత్సాంద్ర విభావనంబు వఱలుటలేదా ?

లెమ్మా ! నిశ్చింతుఁడవై
కొమ్మా ! వరభాషితాళిఁ గుందుటదేలా !
పొమ్మా ! పార్థివలోకము
తెమ్మా ! కవికుంజరాళి తీర్పుల తేటన్

సేమమె ! కోవిదసంజా
తామల వరభావసద్గుణాళికిఁ గవికిన్
ప్రేమయె ! పురాణ కవితా
నామంబు విదగ్ధ జాత నాథాదులకున్ ?

మెత్తురె ! పురాణకవితం
దెత్తురె ! మద్భావలీలఁ దేటపడంగా
కత్తరు లాడకుగాదే ?
సత్తెపు మాటలను మఱచి సరస కవీంద్రుల్

విన్నది విన్నట్టులుగా
కన్నది కన్నట్లు ప్రకృత కార్యము లెసగన్
విన్నాణముగా బత్తిల
కన్నాకా ! తెలుపుమది వికాసముగొల్పన్

తనయా ! ఒంటిగ నిచ్చట
ననయంబు వితాకుఁ జెంది యడలుటదేలా !
కననగు దైన్యము మోమున
విననయ్యెడి వికృతి భావ విభ్రమమేలా ?

భావకవిత్వం బనఁగా
గావఁగ భావప్రధాన కవితయ కాదే?
వావిరి భావనిగూఢై
కావలెఁగా భావగర్భ కవితయు తలపన్

ఈభావకవితయెప్పుడు
నాభాసముఁగా మెలంగు నాభాసకవిం
ద్రాభుల సమితిని పరిగణి
తాభుల మనముల మెలంగ దధికకవులలోన్

నన్నయతిక్కనసోమన
లెన్నన్ శ్రీనాథపోతనేశులకృతులం
దన్నిటఁగానగనగునీ
కన్న సభావప్రధాన కవితారీతుల్

ఉత్తమ మధ్యమ కావ్యము
లిత్తలమున నధమ కావ్యమింపుఁ జెలంగన్
విత్తనమై ధ్వని ప్రాధా
న్యాత్తవ్యంగ్య ప్రధాన మయ్యెంగాదే?

విదితగుణీభూతంబై
ప్రథిత వ్యంగ్యంబుచేత మధ్యమకావ్యం
బధమంపు కావ్య మొప్పను
సుధియై యమకాది శబ్దగుంభనలెసఁగన్

అధునాతన కావ్యంబును
విదితోత్తమ కావ్యమంచు వెలయుట తగునే!

ప్రథిత విహీనాంగిని నా
కథిత గుణీభూతమందు గాంచుటమేలే ?

ఇఁక నథమకావ్యమందును
దిక మక పదగుంభనంబు తీవ్రతదాల్పన్
అకలంకతఁ జేర్చందగు
పకపక నవ్వంగరాదె ! భావకవి కృతిన్

## వాణీ సేవ

దేవి ! నిజాలయంబు వర దేశ్వరుఁ జూడగరమ్మటన్న న
ప్పావన మార్గభూమిని గృపామతిఁ జూడగ నేగుదెంచి యీ
భావిని గూలితిం దమసు బ్రాంమెనయూరె కుదృష్టిఁగాఁగ నిం
కే విధి మార్గమారయుదు నేగతిఁ గాంతునో ! మిమ్ము భారతీ !

తెలివియొకింత లేమి నినుఁ దేటఁగ గాంచగఁ లేమి భూమిపై
నలుగుడుఁ జెంద భేదవిధి నల్వ ముఖంబున వ్రాయఁ జూపు నిం
పలరఁగఁ జిన్నవోయెఁ బదియార్వురఁ జూచుదమన్న మోమునఁ
బలుకు భ్రమింపదయ్యె నిక భక్తునిఁ గావగరమ్ము భారతీ !

మనమా ! శూన్యతఁ జెందె నోటబలుకుల్ ప్రమానయ్యె జీవంబుగి
ర్వ్వానమైపోయె శరీరభారణముఁగావంగా నలభ్యంబు ని

మ్మనుజుల్ బ్రోవగ రాగదే! భువన సద్మంబుల్ గడింతుర్ సదా
వనజాతోద్భవుఁ గూడి నన్ను భవతీ! పద్మోద్భవార్ధాంగినీ!
కలయా లేదు నిజంబుసుమ్ము! నిను మా కాంతారమధ్యస్థితా
కలితానేక సువర్ణరత్నఖచితా క్రాంతాచ్ఛసౌధంబు నీ
లలితాధిక్య సుమాళిగంధవహసంలాపంబు నీసొమ్ము! నీ
కలమాధుర్య విపంచి మాధురఝరీ గానంబుకున్ యోగ్యమా

అనిసుకుమార శైత్య పరమామృతసౌఖ్య చయంబులంద సం
తతనిరవద్యసంపదవితానములొంగ బరాత్పరాప్తి భా
వితనిలయావకాశపరివేష్టిత భావనిగూఢితాంతరం
గతతసు కాలదేశ వర కాంతుల నొందఁదగున్ వనంబునన్

కోకిల, కిన్నరుల్ వరుస గున్నల మావులఁజేరి మొక్కుచు
న్నాకసమంటగీతికల నబ్బురమందఁగ బాడిపాడి భా
షాకలితాభిగానముల నందఱికిన్ ముదమందఁజేసి యూ
హాకళలన్ నవీనముగ నల్లుచు మోదముఁగూర్తు రెప్పుడున్

అలిబిలినల్లుకొంచు సకలాశయ సంపదమర్మముల్ వరున్
దెలియఁగనీక తామె వర దేశ్వరుభావవికాసు నమ్మి యూ
శలఁ దెలియంగఁజేసి జలజాక్షునరంబులసంది పల్లవా
వళులఁజొరంగనీక యొక వావిరిఁదాల్చు లతావితానముల్

కమలజురాణి! మంజుల-ప్రకాశిత వాగమృతాబ్ధివీచికా
విమలకలాభివాణి! సుకవీంద్ర విదగ్ధప్రకాండచారిణీ!

అమరసురేంద్రవిష్ణుత్రిపురారి సువందిత బ్రహ్మచారిణీ!
కుమతులు నీల్గ ఖడహతిఁగూల్చితి శుంభనిశుంభ మారిణీ!

చిలుకలఁ బెంచి నేర్చితివా! చెల్వుని వేదంహాస్యమంది సం
కలనమునన్ జపించియు సకాలము నాటికి వేదపాఠముల్
జలజల వాహినీ విధముఁ జాలుగ బ్రహ్మకు నప్పగింపఁగా
ఫలితముఁగా పఠించితివి! మాధురి యొప్పను తేనెపలుకులన్!

చిత్తము చంచలంబునయి చేష్టలుదక్కి విముగ్ధప్రాణినై
తత్తర మందుచున్ నిజము దాంతి సుశాంతుల గానలేమి నా
వత్తునునుంటినమ్మ యిటు భక్తుని బ్రోవగరాగదే! పరా
యత్తమునాదు జీవితము నైహికవాంఛలఁ జిక్కియుండుటన్

భవసదనంబు పద్మజు నివాసగృహంబు శుభావహంబు సం
భవిత కలావిశేషకృతి వారధిఁ దేల్చెడి దేశమన్న! యీ
నవన వితంత్రముల్ నలుప సత్యవిశుద్ధ సుయోగ్యభావముల్
వివరముగాగ జీవికి నుపేత శుభాస్పదమమ్మ! భారతీ!

శారద! భక్తసంఘవర సంచితకల్పతరుప్రభావ సం
పూరిత భావదాయిని విభుత్వవిధాయిని! హంసగామినీ!
జారితమష్ట సత్వప్రతిభావిధి వందిత సామ్యవాదినీ!
భారతి! బోధఁజేయుమవె సుభావములొందగ ధాత్రిభామినీ!

కలదు కలావిశేషములఁ గాంచిన పొందినభక్తకోటి సం
ఫలిత వివేక ధీవరులు పాండితి సంగ...

కలరు వికాసహీన విధి కార్యకవిత్వసుధారణావిదుల్
తెలియని మందబుద్ధి ననధీనమనస్కుఁడ నన్ను ! భారతీ !

మనమున నమ్మియుంటి పరమాన్యతఁజూపుచు నుంటిఁ బొమ్మనన్
వినయము జూపుచుంటి బహువేదన లొందినఁ గావుమంటి నీ
కనయము పాదపూజల నయాచితభక్తిపి నల్పుచుంటి నీ
వెనరున బత్తునిన్ గుణిగ నెంచి విదగ్ధుని జేయు భారతీ !

పరమ విశాలభావుఁ ప్రతిభావరకాంతు విదగ్ధ పద్ధతుల్
వరమతిఁ జేయు భావకవిపండితు సాకితి మోహమొంద ని
స్సరదవమానబంధకరు సారవిహీనభవాబ్ధి దీపకున్
పరిభవమింత లేక వరభక్తుని గావుము దేవి ! శారదా !

నీమహిమంబుగాంచ నల నీరజజాతుఁడు దక్షుఁడే మొ ! ఆ
రామశుభాంగి లక్ష్మియుఁబరాంగన తేటగగానదే మొ ! యిం
కేమహినేరు గాంచగుగదే ! మధుభాషిణి ! వేద భాషిణీ !
కామితధాయినీ ! నిఖిలగానకళాకవితావిధారిణీ !

పూ జా ఫ ల ము

జోతిమనంబునన్ నిలిపి జోహారులం బ్రణమిల్లి నామతం
బాతత దీనవృత్తి వినయంబునఁ జెప్పికొనంగ నామహా
భూతచరాచరాది సుమపూజితసంతతమానినీ పరం
జ్యోతి కలావిశేషముల సూక్తులఁ దెల్పెను మందహాసియై

నాపూజఫలియించె నాభాగ్యమేమంతేని
నీమూలమునగాదె ! నీరజాక్షి !
వాక్యసంశుద్ధిసంవాదమై యొప్పారి
భక్తసమ్మానంబు పరిఢవిల్లె
భావవిశేషముల్ భావగర్భంబులై
పరిణమించెనుగాదె ! వాక్కులందు
లాలిత్యమాధుర్య రసభావ వాణులఁ
మిళితమైనవిగాదె ! కలితవాణి !
నిర్మలానంద సౌఖ్యంబు ధర్మకలన
నిఖిల కోవిద సంజాతనీతి విధుల
భావసంశుద్ధి గీర్వాణి ! యావరించె
సకల సాహిత్యసంగీత శాస్త్రవిదుషి !

కాలచక్రంబున ఘనసూర్యసోమప
రంజ్యోతి మహిమ విరాజినైతి
స్వోదరరక్షణల్ సోపపత్తిఁగనిచ్చి
సౌఖ్యంబుఁగూడఁగూర్పు సరసుడైతి
వ్యావసాయకకృషుల్ ప్రతిజీవరాశికిఁ
గల్పించి లౌకిక కాంతిగంటి
బరమేశుఁగొలువంగఁ బరమర హస్యముల్
వేదముల్ విధులకు విద్యలంటి

తదుపనిషత్తులు ధర్మశాస్త్రంబులు
నప్రమాణములంచు నాచ్చుచుంటి
ఈకీటకాది-బ్రహ్మాంతు పర్యంతంబు
ప్రాణంబులవికితిఁ బ్రాణితతికి
జగతి డాంబిక వాక్యము చాటుచుంటి
లోకుఁదెలియఁగాదె! సుశ్లోకచరిత
జ్ఞానమొక్కటి యధికంబు జాతికరయ
మానమొక్కటి మాన్యంబు మనుజజాతి.

అంబా! మహిమలఁ దెలియఁ ద
రంబా! పలుమాటలేల! బ్రహ్మాతరంబా!
డంబము భావకపరభా
వంబా! నిర్భాగ్యుఁజేసి తంబా! వాణీ!

పరమభాగ్యంబు భాసుర ప్రాప్తిగాంచి
మోదవిస్ఫూర్తి సంసారముక్తిఁగాంచి
సతతసేవిత పదయుగ సద్మములను
జీవయాత్రల గడుపుదుఁ జిరతరంబు.

శ్రీకాంత! నినుజేరి చిద్విలాసంబుల
భావనారాధనల్ బరగనేర్తు
వనకాంత! యోగసంవాసమగ్నుండనై
కాలాంత ధామంబుఁ గాంతుఁబరము

గీ॥ కాంత! భావనా కేళీవిహారముల్

సలుపనేర్తును బాదజలజమందు

శివకాంత నీదరిఁజేరి శుభంబుల

సేవఁగావింతు శివ! భవాని!

లోకాంత కాలాంత లోలనివాసినై

వైకుంఠవాసంబు వఱలగాంతు

నిఖిలభూతాది సేవల నేర్పుసల్పి

సకలదేవాదిపూజల సంస్తుతించి

యష్టదిక్పాల శైవుల నాశ్రయించి

గరిమగాంతును వైకుంఠగమన భూమి.

# భావవిలాసము

## బాటసారి

వీథి వీథిని దిరుగుచు వెఱ్ఱివోలె
పిచ్చిపదములఁ బాడుచుఁ బేదవారి
యిండ్లకరుగుచు బిచ్చంబు నింతఁదెచ్చి
బ్రదుకుచుండెడి నొకయూర బాటసారి

ఒకచోట బిచ్చంబు నొకచోట భాగ్యంబు
　　నొకచోట శోకంబులోఁగిఁదెచ్చు
ఒకచోట దినుచుండు నొకచోటపానంబు
　　నొకదారిఁబవళించు నోగిజరుపు
ఒకచక్కి సంలాపమొక చక్కి గానంబు
　　నొకదారి నృత్యంబు నొనరసలుపు
ఒకసారి దరహాస మొకసారి దుఃఖంబు
　　నొకకొంత మూగయై యొప్ప మెలగు

పథికుఁడీరీతి నాగ్రామ పరిసరాల
నంటిదిరుగఁగా పోమరులాటగాండ్రు
వెంబడించుచు కేళుల వెఱ్ఱికేక
లిడుచునుందురా గ్రామమందింతసేపు

ఒరులతాకులు లేకయ యొంటినుండి
యొరులభావంబుఁదెలియఁగ నూహాల్లి

పరులఁగినియక తనుదాను బంతగించి
నలుదెసలఁజూచి పర్వుచు నవ్వుచుండు

చారులఁగాచి కొంచుఁ బలుతావులఁజేయుచు సన్నసన్నగా
వారవిలాసినీజన సవార విహార విలాస వర్తియై
గారవమింపుగానక వికాస విలాస విభావచేష్టలం
బేరిమినొందుచుం బరులపేరిమినొందుచు వేళఁబుచ్చెడున్.

కాలముబుచ్చుచున్ సరవిఁగానక యోగులచెంతఁజేరి యే
వేళఁబరాత్పరుం దలఁచి వేదవిధుల్ సరిజేసికొంచునా
లీలల మార్చుచుం బరుల రీతులగాంచుచు భావవీధినిన్
హేళనఁగాదలంచు విబుధేశుల నాపథచారియంతటన్

అరిషడ్వర్గములన్ జయించి పరధర్మార్థంబులంగూర్చిన
ద్వరహోమాహితమోక్షగామిఁగ మహాత్త్వంబునున్ సాకిసా
మరహాస్యంబులఁగాంచి యాత్మనియమంబన్ శక్తిచేఁ బ్రాప్తిగా
నిరపాయంబుగఁగాచు భక్తుఁడిల నిర్ణేతుండుగా నొక్కచో

ఆపురిఁబాయకుండ మనుజావళిఁజొచ్చి మనంబులోని సం
లాపము నాలకించి యుపలాపిత భావములం దలంచి దు
ష్ప్రాపకమై చెలంగుఁ బరభాషల సంగతిఁదూలనాడి భీ
తాపనయంబుగాఁగ ధరఁదారణమొందగఁజూచునిచ్చలున్

విహగము.

అందలమెక్కి-హేల సురయాంచిత వేగనిరూఢిఁ గాంచి పెం
పొందఁగ భారవాహకులుఁ బొమ్మనినీటుఁగఁ దూలనాడగన్.

డెందముజిన్నవోవ బలుడెక్కలుచిందులఁ ద్రొక్కనేగునా
పందలమోతగాండ్రు పలువంకలఁగాంచుచు నేగుదెంచుటన్

పల్లకినెక్కినాఁడు పలువంతలఁబెట్టుచునున్నవాఁడు సొం
పెల్లనుదీయువాఁడు పరుసెక్కిన మాటల తేటఁగాఁడునై
యల్లరిగుంపునందు నవులాటలఁ గన్నులఁబండువట్లు వా
డల్లనఁజూచి యాయడవియందముగాంచి మదిందలంపుచన్

అబ్బురమంద భారకులనాజ్ఞనొసంగఁగ బెబ్బులుల్ వడిన్
బొబ్బలువెట్ట ధీరమతిఁ బొమ్మనివాహకులన్ విదల్పగా
పబ్బమువోయెనంచు వెతఁబాఱినదంచుఁ దలంచునాతఁడా
గొబ్బులదాటిపోయె దొసగుల్ వడివచ్చుచు బోవుటబ్రమో ?

సరసుమొగమున నొకవింత శాంతియుండి
మనసు చింతలవంతల మరగుచుండి
పేదవారింటి బిడ్డగ భేదమొంది
రాచబిడ్డగఁ గాన్పించు నాచరుండు

మొగమున విన్నబాటు మొగమాటమిలేవడి చూపుచాటునె
న్నగవొకయింతలేని భువినానగడించు నెలుంగుబాటు ల
న్వగల విచారమొందు నలువంకలఁ జూడగ సిబ్బితయ్యె న
ట్లగపడు యావనుండిల విహారమునొందఁగఁ గార్యమెద్దియో ?

పదరేఖంబడి పోవ నాసరసు నాపత్తుల్వడిందేలగా
పదమానుండగునేమొ! యంచుమదినిన్ వాదంబులుప్పొంగఁగా
సదయుండక్కట చేటుమేలెఱుగుచున్ శాంతాత్ముఁజేయుంగ నా
పదమందొక్కఁడు లేడు సుమ్ము భయమో! పాపంబునెట్లోర్చునో

## అందము

అతనియాకారమెంచిన నజునికైన
నితనిపలుకుల నెంచ వాగీశువశమె ?
అతనిభావాలఁ దెలియఁగ నభవుకైన
అతనిగాంభీర్య మెనయంగ నబ్ధివశమె !

అందముచందమా ! వసుధయందుఁబసందున జందురందమే
కందము విందునొందు బసికందువమేని పసందు చందముల్
విందము వందనీయమగు వెందవు లించుకసందు చిందమా
చందురుబొందునంద్రు ముఖచంద్రునియందము సందురందుఱుల్

కంతుమటంచు నెంతు రలకంతుని వింతల పంతమెంతన
న్నెంతురిదంతసంతస మదెంతని చింతల వింతపొంతలం
బంతుపుదంతమంత వెసబంతుల పంతుల సంతతంచుఁ బ
ల్వంతలఁ జెంతసంతత మలంతిగ నెంతురు పంతమింతఁగా

ఎన్నఁగవచ్చుఁ జంద్రముఖమెంచిన చిన్నమదెట్లు వోవునో ?
నున్ననితేట పద్మముఖ నూత్నపుబోలిక పంకమేమగుల్
తిన్నగ నెంచినన్ భువినిఁదీఁపువచింప నసాధ్యమంతె ! యే
తెన్నుననుండునో ! యుజాడు తేటగదెల్పగ లేదు నిక్కమా !

పుండరీకములన్న బురదయేమియు లేదు
కువలయంబదియన్నఁ గొలను లేదు
చంచలంబులటన్న స్థానభ్రష్టత లేదు
మృగనేత్రమటయన్న బెగడు లేదు

పంకజోద్భవుడింక వంకదీర్పగ లేదు
        నేత్రసౌందర్యంబు నెగడ లేదు
చంద్రమన్మథ నలచక్రవర్తుల నెన్న
        నవుబాటు రతనాల దివియలగుదు

రిం తె: తలపంగ మేలిమి నెంతయనఁగ
బసిమి యమృతంబు నూఱని పలుకుఁగలిగు
సుధను శోధించి మేలిమి శుభ్రపఱచి
షోడశ కలల నొప్పు నాజూకు మోము

ఎంతకు వచ్చు మోము మనమెంచిన జందురు మచ్చఁగేరెడిన్
బంతము కన్బొమల్ బువుల వల్లరివిల్లును వంకదీర్చెడిన్
సంతసహాసముం దళుకు సంద్రపుదెల్పును గేరులాడె ని
శ్చింతలఁ దేల్చెడిన్ సిసుల చెల్మిని మేనుల చిన్నె వెన్నెలన్

ఆకృతి

బంగారు మేలిమి పతకాల రతనముల్
        గలిపిచేసిన బొమ్మ చెలునిబొమ్మ
చిన్నంబు దీయింపఁజెన్నొందు జందురు
        బదునారుకళలొందుఁ బసిమిమోము
నిండారు మేల్పసల్ సెరయంగ దళుకుల
        మెదిపిన పసనుండు మేనితళుకు
పంతంబు బోఁగొన్న పద్మనాళంబుల
        వెలివేయుఁగంఠంబు గళపుఁజాయ

కెందమ్మివెలిదమ్మిఁ గేరులాడఁగ జాతి
పాదంబులై పుట్టిపడుచుగాంచి
జీవాత్మ పరమాత్మ జీఁజేరంగ దే
దేహంబను పేరిట నావహిల్లుఁ
గూడుచందంబుగాఁగూర్చి బొంతగఁబేర్చి
ప్రాణంబు నూతఁగా ప్రాణియగుట
పేరెముల్ వాఱఁగా వేధలఁ జెందంగ
బొందుఁగ సమకూరె బొందియనఁగ
ఇంద్రియంబులఁగూర్చి యీశ్వరుధ్యానింప
ప్రాణంబు నిల్పఁగాఁ బొలుపడియె

సర్వధాథ్య సమర్థ సంచారపథము
లెన్నొ కల్పించి దేహమందిన్నియనఁగ
జెప్పలేనన్ని వింతలఁజేసి భవుఁడు
బ్రహ్మకృత్యంబు జింతింపఁ బారమున్నె?

ఇంద్రియంబులు ప్రతిప్రాణినింపుమీఱఁ
బ్రేమ దేహంబునభివృద్ధి పెంపెసంగఁ
జేయుచుండెడి నరయుఁడీ! జీవితంబు
మృతము సంజీవమూటయె మృషతలంప

శాంతిదాంతుల వంతల సమయఁ జేయుఁ
గామ-క్రోధాదులెంతయుఁ గాల్పఁబడును
భేదమెంచఁగ నింతియ భీతిఁదామ
సంబగు గొనమున దానె సమయునెపుడు

## అడవిసొంపు

సిరిసంపదలచేతఁ జెన్నారవన్నెయై
        వెలుఁగందులచ్చిమేల్ వెలఁదియేమొ !
వలపించుఁ దలపించు వన్నెచిన్నెలకుప్ప
        వలపుల మొలిపించు మెలఁతయేమొ !
కలకలమనిపించు గాలించుఁ గోయిలల్
        సంచారమొనరించు సంతయేమొ !
మలతావులనిపించు మల్లెమొగడపూలు
        పచరించునంగడి పంచయేమొ !

సరసకేళీ నినాదముల్సరవి వినగ
జాళువాబొమ్మ పలుకుల జాడయేమొ !
తెలియఁగా రాదు గారాబుజెలిమి మేల్మి
నాఁగనొప్పు శృంగార వనైకలక్ష్మి

మలయపర్వతమందు మంటిఁబుట్టగనేర్చి
        వింధ్యాద్రికడఁకేగి పెరుగుటెఱిఁగి
నీలాచలంబున నీటునడకనేర్చి
        శైత్యాద్రికడకేగి శైత్యమెఱిఁగి
హేమాచలంబున హేమంబుదరిజేర్చి
        కైలాసపర్వత కాంతినొంది
మైనాకుదరిఁజేరి మాయడాగురునేర్చి
        నాగరాజయ్యు యనంతమెఱిఁగి
బంగారుగొండలో భాగ్యంబుసరిఁదీసి
        కానీనుదరిజేరి దానమెఱిఁగి

ఉదయాస్తగిరులందు నుదయమరణమొంది
క్షీరాబ్ధిసౌమ్య గాంభీర్యమెఱిఁగి

విష్ణుదగ్గర వేషంబు వెలయఁజేసి
బ్రహ్మదేవుని ముఖముల మర్మమెఱిఁగి
చంద్రశేఖరు నుగ్రత శాంతులంది
నేర్చెనో ! లచ్చి యీశోభ నెన్నదరమె !

దివిజ నందన వనశోభ దీపితంబు
మందమారుత పరిమళ మధుర తరము
మనుజ నిర్జరలోకసోపానపథ వి
హారసరసశృంగారతర్యాదిచయము

నృత్యడోలాయమాన సందేహనిర్ణ
యావకాశాప్సరోజన యాచితేష్ట
దాన మాత్సర్యవారణదత్తశాఖి
మధుకర కరాంగుళి నఖరమయ విదూర

దుర్గమాహిత కళికసందోహములను
దివిజసుందర చక్షుశ్ప్రదీపితంబు
భువన శోభాయమాన సత్పుష్పచయము
జీవితావధి భక్తిసంసేవ నిరత
జపతపంబుల దత్తరసాది ఫలము

దుర్గమారణ్యమత్తసందోహశోకి
లారవాత్మ సంతృప్తి కళావిలాస
మజ్జనాప్సర స్సంగీత మధురనృత్య
బోధనార్థగామి మయూర బుధచయంబు

మజ్జనాప్సర స్సంగీత మధుర నృత్య
బోధనార్థగామి మయూర బుఘచయంబు

అభ్రసంచార యోగ్య విహారకుశల
నిర్మలాంభఃకణారోగ్య నీతిసంఘ
సహచరీమేనకాబాల చరణవక్ర
గతినివారణ హంసరాడతిశయమ్ము

కోకిలాలాపఖిన్న సంకూజితాభి
నవనవోన్మేషరంభాది నాట్యవిజిత
లలితకామనామ శుకసంలాపరవము

మధురమోహాన సంచార మందపవన
లవిత సంమోద భరిత జలాతిశయము

సరసశృంగార దేవికాభరిత భావ
పూర్ణవనలక్ష్మి రోయనఁ బుండరీక
జాల మనుభవింపఁగ వచ్చె సరసుఁ డొకఁడు
సరసుమతిజూడ సౌఖ్యంబు సంతరింప

సుజనదుర్జన భేదసంశోభకాలకు
దీని నిర్మించెనో! లేక దీనజాతి
నరయఁజాలక వచ్చు నీయడవినంచు
బ్రహ్మవిధి జేసెనో! యేమొ! వనవిభీతి.

పాముబట్టిన పగవోలెఁ బరిణమించు
జారవిడచిన మనసు ముంజారగఁబోడు

నిలువరించిన సామేను నిలువఁద్రోయు,
ధాతపనులకు వంకలు తప్పవెట్లు ?

అందచందములెల్ల నీయడవినుంచి
తీసికొమ్మని బెమ్మయే తీర్పుజెప్పి
అదియుఁ గ్రూరపటంబు నాయాసలుడుప
సత్తిబెట్టెనో ! లేకయాసత్తెమొద్ది

వనలక్ష్మి దరిఁజేరి వనటఁజెందుటగాని
అందుశోభలనన్ని నందబోఁడు
శీతాంశునకుఁగాని సేవింపఁబోరాదు
రతితేజమింతైన రాలఁబోదు
మందమారుతమందు మాంద్యంబు నొప్పంగ
వడివీవఁదలకందు భావములర
ప్రాణిజాలికిఁజేరఁ బ్రాణంబువోవంగ
వింతఁజూచుదమన్న వంతలగును

చోరగశక్యంబుగాదందుఁ జోద్యమేమొ !
పరిసరంబులఁజేరి సొంపరయుఁజూచి
ముదితుఁడగును నంతియగాని ముక్తిఁగోరు
గామిచొఱఁగ శక్యంబె ! యక్కాననంబు

తపసులెల్లఁ దపఃఫలధనములొంద
జొఱవఁజూతురు దేవతాసుందరాంగు
లాడుచుందురు లీలఁగా నశసపవను
లంటగాశక్యమే ! పిల్వానలరుఁదావి

నందన వనమును నలగఁ ద్రొక్కఁగఁజాలు
సౌందర్య మహిమ మీ సరసవనము
వనలక్ష్మిశోభల వాసవుఁబూదోఁట
నీసడింపఁగఁజాలు నీ సరాలు
విస్తారచతురంబు వేధింపఁగాఁజాలు
దివిజనందనవన తేజమిలను
సర్వపోషణమున సాధింపఁగంజాలు
సుమనోవనంబు నీసుకుచిరంబు
వరదాతృఫలముల వంచింపగంజాలు
దివిజవనంబు నీదేశవనము
షోడశ కళలను సొంపుఁ గూల్చఁగజాలు
దనుజారి వనమున దాపరికము

అఖిలకోవిద కవిరాజ యాచితంబు
అఖిల గంధర్వ - క్రీడా విహారభూమి
అఖిల గుణగణ క్రీడాయశోంతరాత్మ
మఖిల ఫలసిద్ధి ప్రాపకం బటవి మహిమ.

ఈశ్వరుఁడేవేళ నీప్సితంబుల నొందు
నీయటవి మహాత్వ మెన్నఁదరమె!
జగదీశుఁడేవేళ జరుపు విహారంబు
వనలక్ష్మి మహిమంబు వినఁగవశమె!
బ్రహ్మయేవేళ వరబుద్ధిఁ బోఁజొచ్చు
పూఁదోఁట యందంబు పొగడవశమె

గౌరీరమావాణు లారాధ్యదేవతల్
కాననంబునఁ జూడఁ ఘనత లేదె !

దేవతానీక మరుదెంచి తీవలెల్ల
నందనంబునఁ బాతించి నవవిలాస
పుష్పరాజంబు లొందుట పురుషవశమె !
దైవఘటనముగాదె ! యీ తపోవనంబు

ననగుత్తులైనయుంగ నెనయానె ! పొన్నారు
సనజాజి విరజాజి సన్నపూల
నొనరంగఁ జెన్నారు నోలిసంపెంగఁ దావి
సరిమల్లె విరిమల్లె సన్నపూల
గనయుంగ సొగసొను నవసౌరు బెగడొందు
పురుడించు విరిదావి పొన్నపూల
మనసొను బూఁదీవ మనుచుండు మందార
మధురంపుఁ గెంపారు మంచిపూల

లలిత కళలెల్ల వింతల లలితమౌచు
మనసు జొరనీక మరగించు మంకెపూల
మనఁగ వచ్చును జీవంపు మమతవిడిచి
మనసు నానంద మొందంగ మనఁగవచ్చు.

విరులఁ దెచ్చెద మన్న వెనువెంట సరిదాకు,
బలువంత లంటింత్రు వలఁతిగాండ్రు
వింతఁ జూచెదమన్న వెతలఁ బెట్టుదురందు
వెఱవు బుట్టింతురు వేగులార్లు

కేళికాసరసిలోఁ గ్రీడలాడుదమన్న
        గికురింత్రు సేవకుల్ గ్రేవఁగనరు
ఫలితమొందెదమన్న ఫలసిద్ధి గానీదు
        పంటకాపులునందు వెంటరారు

మనసుఁజూడంగ సరిగాదు మనుజుఁజూడ
వలనుగాదంచు నంటుండి వలసరారు
మనసుకిదియేల ! మనసౌను మనఁగరాదు
వెడలుచుంటి మటంచు వేవేగఁబోయ.

అంద చందములన్నియు నలరియున్న
జిన్నె వన్నెలన్నియు సరిఁ జెలఁగియున్న
వింత తావుంబ వేలు విన్వీధినున్న
ననుభవింపఁగఁ జాలరీ వనముసొంపు.

పరమోన్నతంబగుఁ బరమాభిధేయంబు
        పొందశక్యంబౌనె ! బొంతెయున్న
పరమాద్భుతంబగుఁ బరమాలయంబును
        గాంచశక్యంబౌనె ! కాయమున్న
పరకామితంబగుఁ బరమేశు నిలయంబుఁ
        జేరశక్యంబౌనె ! జీవియున్న
పరశేషితంబగుఁ బరమాత్మధామంబు
        గమనశక్యంబౌనె ! ఘటమెయున్న

బొంతకాయజీవి ఘటాల వింతపటము
నరయుచుండుట హేయమహా నాసవిధి

పరమధామంబు వరమోక్ష శరణపథము
దీనిఁ దెలియంగ వలయు సత్తేజమొంద.

పరమాత్మ దర్శింప ఫలసిద్ధినొందంగ
        వనలక్ష్మి సేవఁ దావడి నొసంగు
వరదేశుఁ గాంక్షింప వరములొందంగ నీ
        భువి నందనం బిచ్చు భూరిభూతి
శ్రీధామము సేవింప సెలవు గావలెనన్న
        నీ వనంబిచ్చు సంసేవకాజ్ఞ
శ్రీ పరంజ్యోతిని సేవింపఁదలఁపున్న
        నుద్యానవాసంబు నోర్మినిచ్చు

మనుజుఁ డేపని గోరిన వనమునడిగి

సంతతఫలంబు లొసఁగంగ సాఁకుఁగోరి

వెతలఁబడకయు జీవి తా వెతలనడఁప

నీవనంబున వాసంబు నెంచవలయు.

వనలక్ష్మిపూజల వాంఛ లీడేరంగఁ
        బరమార్థలాభంబు భక్తతతికి
ధనలక్ష్మి సేవల ధనభాగ్య భోగముల్
        దరిజేరు వినుతింప ధర్మితతికి
గజలక్ష్మి దానంబుఁ గాంక్షలన్నిటిఁ దీర్చు
        గణుతింప శక్యంబె ! కర్తృతతికి
వరలక్ష్మి గానంబు వనలక్ష్మి దానంబు
        వర్ణింప శక్యంబె ! భక్తతతికి

పరమపూజల దొసఁగుల
నియమకల్పుని దరిఁజేరి నియతిఁదెల్పి
పరమబోధలఁ జెప్పుచు భక్తవరుని
మెప్పులొందెడి వరలక్ష్మి మేల్మినిచ్చు

మనమున శాంతిఁబొంది మఱుమాయలనెంచక జీవితావధిన్
మనన వశంబునొంది మది మానితభావ పరంపరల్ వెసన్
ఒనరగనొందెనేని పరమోన్నతధామము నొందువాఁడు స
ద్ధ్యానఫలసిద్ధినొంది వరధన్యతఁ గాంచనగున్ వనంబునన్

పూర్వసంస్కార సంపూజిత ఫలసమ
        గ్రవిశేషభాసుర కరవనంబు
సంచితజీవన సంపాదనాంచిత
        సాధనఫలమోక్ష సంచితంబు
పురుషార్థ సమభావ పూర్వజ లసిత ధ
        ర్మాచరణాధిక రాజితంబు
సకలకలా విలాసాఽహిత ప్రతిభాచ
        తుష్షష్టి విద్యాచతురతమంబు

శత్రుషట్కదమన మనశ్శాంతికాంతి
మోక్షసామ్రాజ్య ధన్యసంపూజితంబు
సర్వఫలసిద్ధి దాన సంస్కారమనఁగఁ
దనరు వనలక్ష్మి వనశోభ తరువనంబు

కాంచుచు నద్భుతాంబు రుహకాంతుల నీను సరోవరంబుల
న్నెంచుచు భద్రమోక్షఫలనీతి విధాయక బోధనాగతుల్

నించుచు భావబోధపరదేశుని చిత్రముఁ జూచుచుండ న
మ్మించు లతావితాన తరుమేదురశోభ వనంబుగాంచుచున్
పరమమోదంబునొందు నాపరమపురుషుఁ
డాలతావళి నెంతయు నబ్బురంబు
వెలిగబుచ్చుచు నావనవేది మూఁగి
మురువుఁజూపును లోలోన మురువుగులుక

శయునింప సరివచ్చు సనజాజి విరజాజి
పూలపాన్పులపై నిముసమునైన
సరియనఁగాఁ జెల్లుసరస కర్పూరపుఁ
బరిమళ సవలతాభరితమైన
పెదవిఁ జేర్పఁగవచ్చు గదలని ముకుళ స
వోన్మేషకింజల్క పుష్పకళిక
కరము బోల్పఁగవచ్చు సరసికాపద్మ వి
కాసలీలాభావ కాంతిరుచుల

డా బు

నీతిఁ జెప్పఁగవచ్చు నియమంబుఁ బాటింప
నేమమెందును మన్న నీతిదూర!
తీవిఁబల్కఁగవచ్చు తీవిఁ జూపఁగవచ్చు
మనుజవంచనగాదె! మాయదారి
పేరులొందఁగవచ్చు వేరుజేయఁగవచ్చు
వింతనరుఁడుగాదె! వెడగుదారి!
కేరులాడఁగవచ్చు కీచులాడఁగవచ్చు
గెలింత సరిగాదు కిమర పథము

వింతపనులను జేయఁబల్కెతలఁబెట్టి
సరియుకాదు నరునియందు సంతుదారి
పదిల పఱచుట సరిమేలు పతికి సతికి
జీవసుఖములనొంద సంజీవి వలయు.

వి నీ తి

పరులు సెప్పినమాటలఁ బదిలఁ బఱచి
మనసుమటుగాయజేయు సంభరణకుటిల
వర్తనుండిలఁ దనుదానవంతఁగుమిలి
దానుదీసినగోతినిఁ దానకూలు

ఒరులసొమ్ములకాసించి యోర్మిదక్కి
విమలమతులను విడనాడి విమతిఁగూడి
యొడలుదెలియని పనులనునోలి జొచ్చి
తానుదీసినగోతిలో దానకూలు

మనసునమ్మిన ప్రాణికి మాయ యుడుగు
నంతరంగంబె యాదర్శ మగునుజూవె !
యెట్టిభావనయుండిన నట్టిఫలము
లొందుటబ్రమొ ! యెచ్చోటనురు ప్రతీతి

తానుజెడుటయుగాక సంతప్తుఁడగుచుఁ
బరులనొప్పింప సంతృప్తిఁ బడయునొకఁడు
నీతినియమంబు విడనాడి నీల్గ జేయు
చెడినకోతియె వనమెల్లఁజెఱచునట్లు

మనలఁజూడంగ దుష్కృతి మనన జేయు
మనముఁజూడంగ దుష్కృతి మాన్పఁజూచు
దేహదేహులకైక్యంబు తేజరిలక
యెవరి దారియు వారిదా నెంచిచూడ.

అఖిలజీవుల కాధారమైనవాఁడు
జంగమస్థావరావళి సాఁకువాఁడు
విధినియమబలముల గూర్చి పెంచువాఁడు
దిక్కుగనవచ్చు దీనుల దిక్కటంచు

మనసునొకతూరి యటుద్రిప్పి మననఁజేయ
సర్వజనులకుఁ దెలియు నీచావుబ్రదుకు
లరయఁజాలక గొప్పఁగా నదరిపడుచు
మితముపండుగ నశియింత్రు మేళవించి

ఇతరజీవులఁబోషింప నెంచిమించి
పరులజోలికిఁ బోని నిష్పక్షపాతి
తనకుఁదోచిన సాయంబు ధర్మబుద్ధి
సాయమొనరించు నతఁడెసూ! సరసుఁడిలను

ఎట్టిభావనయున్న నెప్పటికైన
నట్టిభావనయౌను నరయంగ ఫలము
పరమాత్మ జీవాత్మ సంగియైక్యంబు
సరవిగాంచుట భావి సల్భావ్యప్రకృతి

సుఖమై బ్రతుకుచుఁ జోద్యములర్పన్
అఖిలచరాచర మాలయమంచుక్

అఖిలము గానము హాయియొలర్పన్
సుఖములనుండీ! సొంపుగ జీవుల్;
భూతసమూహము బొందు సుఖంబుల్
శాతశిలీముఖ జాలములొందున్
కాతరరాజుల కాయములెల్లన్
వీతవిరక్తిన్ వెఱతురు రాజుల్
నీలాంభోదము నెఱపును గాంతిన్
బాలాంభోదము బర్వెడి సుఖముల్
కాలతీతము కలుషంబయ్యెన్
హేలాభావమదెక్కుడు నయ్యెన్
వంకరటింకర వాక్యములెల్లన్
శంకరగొట్టిన కాఠిన్యంబుల్
శంకలుదీరిన సాంఖ్యములోలెన్
పంకరహితమ్మై బరగును భువిలో

కవి

ఒకదినంబున బుధులంద ఱుబుకుచుండ
కావ్యమొక్కటిఁ జదువుచుఁ గవివతంసుఁ
డొక్కదృష్టిని నిగిడించి యొక్కబుధునిఁ
గాంచి యొలుఁగెత్తి వినిపించె కావ్యగీతి

భోగమే సుఖజీవి భూషితుఁ జేయు
త్యాగమే ధనవంతు ధన్యుఁ జేయు
సచ్ఛీలమే గొప్ప సద్గుణమ్ములకు
స్వచ్ఛంబు మేలౌను సర్వవర్ణముల

ప్రకృతిలో లీనమై రాణింపవలెను
వికృతిలో ప్రకృతియై విహరింపవలెను
భావవీథిని జొచ్చి భావనాగాఢ
భావనంబొనరించి ధన్యత్వమొందు

వ్యంగ్యప్రధానంబు వాచ్యార్థమొప్పు
భంగ్యంతరంబున భావింపనొప్పు
ప్రతిజీవి నిత్యంబు ప్రకృతిభావాన
గతిపను వత్సరాల్ కలియభావాన

నీతిపరులకెల్ల నియతిగాన్పించు
నీతిదూరులకెల్ల నీచమన్పించు
భావంబు గమనింప ఫలసిద్ధియగును
భావంబు లేమిని ఫలశూన్యమగును

## నీ తి

కాయకష్టంబు లొనరించి కష్టమనక
యొడలుమరచుచు నియమించు నొక్కజీవి
హృదయపరివర్తనంబును నీగుచుండి
వంతలొందుచు నశియించు ప్రాణియొకటి

సంభ్రమాదులఁ దడబడి సందువిడిచి
పనులచెఱచుట పాడియా ప్రాణితతికి
నెట్టిపనులైనఁ దొందరవెట్టఁగూడ
దంద్రు పెద్దలా శీతినిఁ దలఁగఁజేయు

విజ్ఞానయుగావనిపై జీవివెఱపు లేమి
జీవసంసార సాగర పవనగతిని
దేలియాడుచు మోక్షంపు దీవి దాటి
సుమతి కాపురుషత్వంబు గూల్పవలయు

జ్ఞానమధువున కాశించి జాతివారి
సహచరత్వముఁగోరి సంస్కారమొంది
మనుజసంతతి మధుమాంస మద్యశాల,
జేరుచుండుటన్యాయంబు చెనఁటివిడిచి

పేరుగొప్పకుఁజెప్పుడు: బేర్మిఁబలికి
జీవితంబులగడపెడుఁ జెనటులెల్ల
నిలువనీడకుగతి లేక నీల్గుచుండ్రు
పేరుగొప్పయు నిజమునకూరుదిబ్బ

అరమరలు లేమి నడియాసలడుగుముట్టి
తెలివితేటలు వెఱ్ఱిఁగా దేలియాడి
గుట్టులన్నియు రట్టులై గుమియుఁగూడి
గగనహర్మ్యంబు లడుగంటి కాలిపోవు

చాడిమాటలఁబలుకుచు సాఁకువిడిచి
మనిని నొకరీతిఁ ద్రిప్పగ మనవఁజేసి
కొంపకూల్చుట పరిపాటి గొప్పఁగోరు
గురుతఁదెలియని యనైకార గురుతఁగలుగ

చొల్లుగబురులవాగిన చోద్యమెంత ?
కల్లమాటల కాశించు గర్జమెంత ?

ఇల్లుపొల్చిన కుందేలు దెల్లబోవు ?
పల్లువిడినమూబాలు పసుగులిసవె ?
చాడిమాటలు చిటుకలో సాగిపోయి
స్వర్గనరకంబులందిర్గి సాగుచుండు
అగ్గులంటిన పల్లెలు నాసలుడిగి
దశదిశలఁ బర్వులిడు పలువావ్రుల్లు
ముందుఁబలికియు నొకనిపై ముసువుగులుక
నుబుసుబోకకు వెఱ్ఱియై యూహలేమి
గుట్టులన్నిటి నొరులపై రట్టుఁజేసి
మసలుచుండును వేటిడి మాంద్యుఁడొకఁడు

## దుర్నీతి

భావలయంబున జనన భూతి నశేషవికాసజన్మం సం-
భావిత పూర్వ సంస్కరణ మావిత దుష్కృత సత్కృతంబులే
భావిసుమార కష్టసుఖప్రాప్తికి హేతువులై వెలుఁగఁగా
గౌరవమొందు మూఢులకు గౌరవ సౌఖ్యచయంబు లేలకో !

పూర్వజన్మములెంచి మునిసిపోవుట గాని
పుజన్మ సంతాపమెఱుగ లేదు
పరజీవి బాధింప సరవిఁగాంచుటగాని
నిజకష్టజీవంబు నియతిగనరు
స్త్రీజాతిఁజూడంగ జిక్కియమారుటగాని
సంసారసారంబు సాఁకలేదు
బీదసాదలఁగాంచి ఖేదమూనుటగాని
తనజన్మ ధన్యతఁ దలఁపలేదు

విటవిటీజన సాంగత్య-ప్రేమనంది
పరులదూషింప నేరయుట బాడియౌట
నిజజనావళిఁ బోషింప నియమముడిగి
బ్రదుకు చండాలు రీభూమి బ్రదుకనేల ?

అన్నమో రామ ! రామచంద్రా ! యటంచు
తిరుగుజనులకు నిహమందు దిక్కు లేమి
దీనులన్నిండి యీరీతి దేశముండఁ
బుడమి నిలుచుట యెట్లొకో ! ముక్తివిడిచి

చిన్నబిడ్డలబోలెఁ జేతులఁ బెంచిన
సంపదలన్నియుఁ గ్రూరజనులఁ జేరు
నాది నాదియటంచు నాణెంపుముద్దల
సాఁకబెట్టినఁ బరశాల జేరు
సోదరాదులఁదూలి సొంపుసంపాదన
మంతయు సంగళ్ళయందుఁ జేరు
దాచిపెట్టినదుడ్డు దారి జూచుక వెళ్ళి
మధుసేవ స్త్రీసేవ మరగ జేరు

హానిభావంబు దెలియలేనినదప్పె ?
ధనమె మూలము జగతికి దానయనఁగఁ
దానజెడుదురు నిలుతురు దాంభికులును
వింతిచూఁగద ! ధనమును వింతఁగొలువ

అందలమునెక్కించి యైశ్వర్యమెంచి
కొందల మిసుమంతఁగూర్మి బోషించి

జీవబాధలఁ బెట్టు జీవిసంసారి
కావరంబునఁగూలుఁగాంచి కొంపారి
పిన్న పెద్దలెఱుంగ బీదల నెఱుఁగ
చిన్నతనమటంచుఁ జెలఁగునీ టెగుర

ఆలుబిడ్డలఁగావ నాస లేదంచుఁ
జీవిబోవఁగజూచు జెనఁటులనొకఁడు
తిండితిప్పలు లేమిఁ దిరుగాడుచుండి
పండి పానులకొంపఁ బాడౌను మొండి

ధనము మూలముజగతికి దాతయయ్యొ
తనదుదుర్గుణ మిసుమంతఁ దలఁపదయ్యొ
నాయమయ్యెనుగాదె ! అన్యాయమిలను
ఇదియ కలికాలచోద్యంబు నెంచిచూడ.

భవగుణంబులనేరుచుఁ బాటుగాంచు
నీచమెంతేఁగ జగతికి నిజమటంచు
సత్పథానువర్తిని సదాచారు నిలను
గానశక్యమె ? నాయంబుఁ గాంచలేము.

భావవీధులనెన్ని భావనల్ సరిగాంచి
పరితాపమొందు సంపాతి యొకఁడు
హృదయంబు దొరకొని యూహితంబులఁగాంచి
సంతాపమొందు సంసారియొకఁడు
పరపీడనంబులఁ బరువుగా నెంచుచు
నిజబాధఁదనియింప నిల్చునొకఁడు
పరులబాధింపఁగాఁ బొల్గొని పరికించి

శ్రీ శ్రీరంగశ్రీ

సిలశెట్టి కారించు నీచుఁడొకఁడు

హెచ్చుతగ్గుల జూచుచు నేవగించి
పరమపురుషుల బాధించు పాపియొకఁడు
ఈసుబూనుచు గొంపల నెంచలేమి
బ్రదుకుదెరువుల గనలేరు పాపులిలను

భేదకల్పన మొనరించి భేసమెంచి
పరుల బోషింప భంజింపఁ బంతమూని
నిజయశంబుల భాగ్యాల నీతివిధుల
నాశమొందించుకొందు రన్యాయపరులు

సు క వి త

కవనమల్లుటగాని కావ్యకన్యకఁగాంచి
వర్ణింప నూహింప వలవదయ్యె
యమకాదిగుంభనం బలరారగమనంపు
దారిజూపుటగాని తనువదయ్యె
మృదుమధురాది సమ్మేళన రసభావ
గ్రహణంబు వ్యక్తంబు గానదయ్యె
రసభావపాకాది రంగన్మధుపిపాస
ననుభవింపఁగనీక యభవమయ్యె

అసమసాహిత్య పదరసహావభావ
మిళితమాధుర్య కావ్య సంమేళనాప్తి

యగుచు కావ్యకన్యక వరహాలహాల
ఫలరసంబొప్పు భావవిభావశాల

కవితనల్లుటగాని గణయతిప్రాసాదు
        లల్లగాసరిగాదు కల్లకవిత
శబ్దజాలాదులు చదువరి కింపౌనె !
        ఆడంబరంబౌనొ ! యార్యకవిత
నీచోపమానమై నిర్జీవ ప్రతిమయై
        నిరలంకరణముల న్నెగడుకవిత
దానంబు లొందఁగ ధనవంతుఁదరిజేరి
        దారుఢ్యమెడలించు దానకవిత
పదములల్లుటఁగాని భావశూన్యంబులై
        పరిఢవిల్లెను శూన్యభావకవిత
కృతులసంపాదనకై కీరితి దనుపంగ
        బొగడిక మెప్పించు మురువుగవిత

కవితగాంచిన నిర్జీవ కాంతివిడచి
ప్రతిఫలించెడు జీవసంభావ్యమగుచు
వ్యంగ్యభావ రసస్ఫూర్తి వఱలుఁగవిత
మెప్పులొందెడు బుధులచే మేల్మిఁగవిత

సరిగమ పదనిసల్ సాగదీసినఁగాని
        సంగీతశాస్త్రంపు సరవిరాదు
స్వరలయభేదంబు వరుసఁ గాంచినగాని
        పాండిత్య ప్రకరంపుఁ బాటురాదు

నాట్యరంగములందు నర్తించినం గాని
    సానిగంతుల కింత సాటి కాదు
భావాభినయములఁ బరఁగఁ జూపినగాని
    ప్రకృతులభావ సంభవముగాదు

మధురసంగీత శ్రావ్యసమ్మానమగుచు
శ్రోత్రపేయంబు నొనరించు శ్రుతివిధంబు
లలితకళలఁ జొక్కించు సంలాపగరిమ
పరవశత్వంబొనర్చు సంభావ్యోత.

అనుచుఁ బలుకుచుఁ దిరుగు నాహావభావి
పటురయంబున వ్యాసంబు బదిలపఱచి
వీనులకు విందుజేయు నా వెఱ్ఱిజనము
నెగడుచుండును నేవేళ నిండుబత్తి.

వరలక్ష్మి

మానసంబునఁ గాన్పించి మఱుఁగుఁ జెంది
మాయయున్న మఱింత సమ్మానమిచ్చు
గతినిదెల్పిన దరహాస కాంతినిచ్చు
దేవి! వనలక్ష్మి వినుతింప దేహావశమె!

సంపదలిమ్ముతల్లి! పసిసంపదనమ్మి పదాంబుజంబుల
న్నింపుగఁ గొల్తుదల్లి! వరనీతిచయంబులఁ దెల్పి దీవెనల్
సొంపుగనిమ్ముతల్లి! హృదిఁ జోద్యమదెంతయు నమ్మకమ్మ! నా
కింపుగ దేహఁజొచ్చి మదినింపుగ జేయవె లక్ష్మి! శ్రీరమా!

ఆయాసంబునఁ బూజఁజేయుకయొ నిన్నుత్యాగశ్రీ తాపంబునన్
నీయానన్ సఫలంబు జేయుకయొ నిర్నిద్రా రతింజెందుట-
న్యాయాగంబునుపంగ నీవశము నానా రాజ్యలక్ష్మీమని
న్నీయానం జరియించువాఁడ నిలరాణింపంగ లక్ష్మీశ్వరీ !

నిజభక్తవరముల నిరసింపదే వేరి
నిందితఁజేయు నిర్నిద్రయేల
వరభక్తుగోరిక వాంఛించు దేవేరి
కఠినాత్మయనెడు వాక్యంబదేల !
పటుతరభక్తిసేవల వలదను దేవి
కోపనామణియని కుందనేల !
జీవంబునిల్పఁగ సేవఁజేయుచునున్న
నిరసింప గోపంబు నిల్పనేల !
ప్రేమమీరగశక్తి వెతలఁ గుందుచునున్న
విదళింప ననురక్తి విడలనేల !

నీపదాంబుజధ్యాన నిర్నిద్రజెంది
మదిని నీయధీనముగా నిమగ్నముగను
సరసమోక్షాధి దేవత సరసఁజేరి
సేవఁజేయుగనేను వాంఛించుచుంటి

పంతములొందనౌనె సమవాదముగాక యధర్మవాదమూ
వంతలఁబెట్టనీకగు నుపాయము దేమి ! వివాదప్రౌఢిమం
జింతలఁజెందువాఁడ యిదె ! చెంతలనున్న నపాయహానుఁగా
వింతగఁదోఁచెడిన్ వరమివేకిని ! కోపముస్నుంగు శ్రీరమా !

నామదిఁజొచ్చి యంనుగల నాయము బత్తి వినీతిసంపదల్
హేమవికారవ్రజముల హీనత భాగ్యముగల్గ చింతలో
ధామవిశేషముందలఁచి ధన్యతనొందఁగఁ బాదదింతనా
కామిగనై చరించి వరగానముఁజేయుచునుంటి శ్రీరమా!

కరుణఁగజూడుమమ్మ! యిక గాయమునిల్ప నశక్యమమ్మ! నీ
వరకృపఁగాంచి జీవముచు వంతలనైన సహించుచుంటి నా
పరుసపు వాకులన్మదిని భావనలల్లక బుత్త్రుఁడంచు నీ
సరసనుఁజేర్పుమమ్మ! సుఖసంపద భాగ్యవిధాయినీ! వెనక్

కర్మవు

కర్మవులెల్ల నిష్ఫల వికారములొంది శరీరకష్టముల్
మర్మములై యొసంగనిక మానవజన్మము కర్మభూమిపై
ధర్మవులాచరింపవలెఁ దాల్మిము శాంతి యసత్యభాషణల్
కర్మవులన్ వికారముగఁ గర్మల సల్పవలెన్ ఫలాప్తికై

పాపమతింజరించుఁ బరభావననొంచు సమస్త భావము
న్నేవుఁగ తెచ్చగొట్టు మది నీసుం గాంచి ఛలోక్తుల న్పైసన్
బాధ్రిపుఁగ గొంచు వేదల నపారవిమూర విటాళినొంచి యే
డాపరికంబు లేక పదివాకులఁ జాటు నధర్మలుందురో?

జీవితావధితగ్గు జీవైక్యమొందింప
జీవంబుసరిగాని దేవుఁడగునె!
ఆయుపల్పంబు విహారసంచార మం
దాత్మయొసరిగాని యధవుఁడగునె?

కృత్యంబనల్పంబు కీర్తిసంపాదింప
సత్యంబుసరిగాని శౌర్యమగునె !
విజ్ఞానమగుదాను ప్రేమఁగల్పింపఁగ
బుద్ధియుసరిగాని బుధుఁడుతగునె !
నీతిమార్గముదప్పి నియమంబు నిలబెట్ట
భావంబుసరిగాని భవుఁడగునె !
సత్కార్యమేలేదు సత్కర్మవాంఛఁగ
ధర్మువుసరిగాని ధాతయగునె !
శ్రీసంపదరుదౌను సిరిసంపదలనొంద
త్యాగంబుసరిగాని ధనమదగునె !
మానంబుతరుగౌను మానంబుగాపాడ
మానికేసరిగాని మనుజుఁడగునె ?
జీవసౌఖ్యమె లోటు జీవంబు సుఖమొంద
జీవికి సరిగాని జీవితగునె ?

లోటుపాటులెరిఁగి మఱి లోకమెంచి
లోకమే సరిజేయ సుశ్లోకమగును
విధినిదూర నేల ! భవుని ప్రేమ దేల ?
జీవబాధలదొలగింప జీవుఁడగును.

మదిని భావింప మటుమాయమై చెలంగి
తీవ్రకోప సంభూతియై తేజరిల్లి
విమల పరిణామబుద్ధిసంవేదియగుచు
పరగుణంబుల దెగనాడుఁ బామరుండు

గృహధర్మంబులఁ దెలిగసల్పన్
సహపత్నిని మదిసంతృప్తిగాంచన్
విహరించునరుఁడు వేద విధులతో
సహకారిఁగమది సాయముచేయున్

పురుషార్థంబులఁ బూనికనడుపన్
వరగుణజాలము వంతుగఁజేయన్
పరసహనంబుల పారము లేమిన్
సరగున సత్వముసంపాదించున్

ధర్మబుధులను సధర్ములజేయున్
మర్మరహస్యము మాటలఁజేరున్
గర్మలఁబ్రతుకుచుఁ గాయము నిల్పన్
వర్మముమూడ్కొన్ వలచుచునుండున్

నీతిపరుంగడు నిందితుఁ జేయున్
అతులితకష్ట విహారునిఁ జేయున్
వెతలకతంబున వేధలఁబెట్టన్
అతికఠినంబై యలసటబెట్టున్

దీనికి మూలము దైవమె యెంచన్
వినయమె మూలము వేధ తొలంగన్
అనయము సత్యము నలవడిధర్మం
బెనయముఁగ నిల్పుట యీహితవిధియా

నీలాకాశము నిర్మల మగుచున్
హేలాలీలము నెక్కుడుగాగన్

ఆలాపంబుగ నాదర మెసఁగన్
లాలితపదముల రాణించు మదుల్

కామితవరములఁ గాంక్షించి విధిన్
యమియై కర్మల యాచరణంబుల్
భామను మనమున దర్శించుమదిన్
కామము దొలఁగినఁ గర్మవు దొలఁగున్

సుఖముల కాశింపకుమా!
మఖము లనేకములఁ జేసి మన్ననగనుమా!
సఖుల దరిజేరనిమ్మా!
యఖిలంబును ధర్మవౌను నరయుము మనమా!

భాగ్యము లెల్లంబడు నిల
యోగ్యంబుల కెల్లయునికి యూహింపంగన్
భాగ్యంబ యగుచు ధర్మవు
యోగ్యముగాఁ దనువుచుండు యుక్తివివేకీ!

ప్రేమవిస్ఫూర్తి నొందఁగఁ బ్రియము మెసంగ
సరససంభాషణంబుల సాఁకునేని
విమలతత్కాల ప్రేమలు వెలయునపుడు
తిరముగాలేదు సెవ్వఁగఁ బెరుగుగాని

నిముస మొక్కటిఁ బోనీక నీతినిలిపి
కాలమహిమంబుగాంచి సత్కార్యమొంచి
జీవితంబు వికాస సంజీవమంచు
బ్రదుకుజీవుండు సద్గతి బడయుజగతి

నిష్కపటవృత్తి సత్యంబు నిలువరించి
పలుకునాతండు వెతలచే బాధపడఁడు
ఊబును బోకఁగల్లల నూఁగునతఁడు
వెల్లఁబాటుల నొందెడు డిల్లవోఁగు

ప్రేమభాజంబు లోక పరేంగితజ్ఞ
తాత్మభావించి శుభముల నందుకొనును
దేహి దేహంబులన్ సమదేశతలము
గాగ నిల్పుచు సుఖములఁ గాంచవలయు.

డ్రీ

దైవమంచు భావించు సత్యాత్ముఁడెవఁడు
జీవితావధి భాగ్యంబు జెందునెవఁడు
తనదుపుట్టుక కల్మసంతానమంబర
గారణంబుగ నెవఁడిల ఘనుఁడుగలిగె

సత్యశక్తియుక్తినొనర సత్యభక్తి
దాంతిశాంతి విభూతి విశ్రాంతికాంతి
తతియు వెలయఁగ సద్వృత్తిఁ దాల్చితనదు
నాత్మ పరమాత్మ నియ్యంగ నలరె నెవఁడు

నియమపు మహిమగరిమ సత్యనిష్ఠ లెసఁగ
నిలచి రక్షింప లోకంపు కొలమిమించి
భూతచయములఁ జేరొంద భువినినిల్ప
వంశనామంబుఁ వంద్రిగా వఱలునతఁడు

దారపుత్రాది రక్షణదాల్చి భువిని
పేరునిల్పిన సచ్ఛీల గౌరవమున
సాఁకువాఁడిల దండ్రి సంసారియగును
తనయ ! పైతృకమందుండి దాటలేవు.

పదిగుణంబుల నొకచోటఁ బదిలపఱచు
మానవుండిల గురువౌను మాన్యుఁడగును
మంచి గానములప్రోకయై మానియగుచు
మేల్మిఁ బరిమళమబ్బిన కల్మినొందు

లిప్తము

శ్రీపద సేవలం జెలఁగి చెన్నువహించి మనంబు జింతనా
ప్రాపకమై యెసంగి వరభావిచరించి నటింపఁగోరి లో
కాపనయంబునం బరముగాంచిన వీరుఁడు ధన్యుఁడౌనిలం
బాపభయంబుఁ జెంది పర భావమునొందుమ ! నీచచిత్తమా !

ఆసలువీసలయ్యెనె ! పరాశల మేల్మిగడించి జీవితం
బీసుగఁగాఁదలంచి సంభీతివహింపక మోక్షసాధనం
బీసమువీడ్చునంచుఁ దలపించుక మాటలనమ్మియుండి నీ
బాసలఁ జెప్పివేసముఁ బాసిరసంబునఁ గొల్వుచిత్తమా !

సంతసమిసుమంత సాహిత్యమురుదంత
సహితభావము లెన్నొ సాగుచుండు
పంతము పిసరంత పౌరుషంబురుదంత
పాపభీతికిజంకుఁ బరగుచుండు

వంతులు కసరంత వాణిజ్యమరుదంత
        చేరసారములన్నిఁ బెరుగుచుండు
వింతలు విసమంత వేసంబు వేలంత
        వేషభాషలపర్వ్యె వెలయుచుండు
సంతలు పెసరంత సంపదల్ కోట్లంత
        సంపత్తుభాగ్యముల్ సాఁకుచుండు
వంతలు పసరంత వదనంబు వెఁయంత
        వనలోకపరివృద్ధి వరలుచుండు

సంతసంబువంతము వింతవంతులయ్యొ
సంతవంతలు వీగియనంతమయ్యొ
కాంతి దాంతి శాంతి విఖ్యాతియయ్యొ
జింతవంత పొంతవలంతి చెంతనయ్యొ.

## దుర్దినము

నీలమేఘంబుల నీలకంఠంబులు
        నిరవద్య నృత్యంబు నెఱపఁజొచ్చె
చాతకముల్ గర్భసంభవంబులకైవి
        జాభీష్టఫలముకు సంతసించె
వ్యవసాయకృషులకై వ్యవధిలేదనియెంచు
        సంసారి యజ్ఞల సంతరించె
చేరంబులేపోయె బీఁంబులేలరా !
        యంచు శ్రేష్ఠులుఁగూడి యఱనుచంద్రు
నానవేలుప ! నీకు వందనంబిదె ! గొమ్మ
        టంచు రైతులుఁగూడి యార్చుచుం(

దేశమంతయు చల్లగ నాశలెల్ల
దిగులుపడి విన్నవోయెనో! తేజముడిగి
వెతలగుందుచునుండెడి వేత్తవోలె
ఆకసంబంత దుర్దిన మావహిల్లు

## పూలరంగడు

మానస పంకజంబున సమానుషకృత్యములాచరించి భృం
గానతి పత్రముంబగిది గాఁ మొనచ్చుచుఁ గేలులాడుచున్
జానుబలంబుగా మధురసంబును గ్రోలెదు భక్తుఁ గాంచునో
దీనజనావనా! భవ! మదీయచరిత్రము నెట్లు నిల్పుదో!

మనమున నమ్మి భావమున మన్ననఁ గొల్చి మదీయజన్మమున్
దినఁగని నీవశంబుపడి దిక్కనుసీవె! యటంచుఁ గాంచి భా
వన లలరంగ నేను భవవారిధి దాటఁదలంచి వేడగా
గనవిన లేవదేమి! ననుగాంచఁగ లేవొకో! కావలేవొకో!

శాంతమటంచుఁ జెప్పి ధర జారుల చోరుల రెచ్చగొట్టవో?
కాంతునటంచు బల్కి పలుగష్టములొందఁగ గాల్చివేయవో!
మంతరమంచుఁ బల్కి మఱి మాయలఁజేసి మదంబణంపవో!
ఎంతగనమ్మవచ్చు నిను నీశ్వర! దొంగవు నీవకావొకో!

వంతలబెట్ట నేల! పలుప చేఁ ద్రిప్పగ నేల! జీవినీ
చెంతల భాగ్యభోగములఁ జేర్చి సుఖింపఁగ జేయ నేలకో!
సంతత ఖిన్నగాత్రుడయి సంపద భోగము లెల్లదక్కఁగా
చింతలఁ గుంద లేమి వెతఁజెందుచునుండు మనంబు నమ్మవో!

మనసుంచి మన్నించి మానంబుగాపాడు
        మనుజుఁడొక్కఁడె భూమి మాన్యుడగును
చండాలుదరిఁజేరి సందుగొందులబోవు
        సంసారియొక్కడె సాధు డగును
జారచోరులవీడి సరిదారివర్తించు
        సాధుఁడొక్కడె యిల జనుఁడనగును
మానంబుపీడిన మాలిన్యజనునితో
        మనసిచ్చి మాట్లాడ మనుజుఁడగునె
నీతినియమంబు విడిచిన నీచుఁడిలను
కాలిబందాల సరిగట్టి చాలమోద
బుద్ధివచ్చుట గనమెందు బుద్ధిజాడ్యఁ
నేస్తమొనరింప మనవచ్చునే! లథంగ!

సత్తెమెంచక హింసల జారచోర
దుర్గుణంబులు వెల్వాను దూకులెందు
సజ్జనంబులఁ దరిజేరి చావగొట్టి
తార్పుమాటలఁ గొంపలనార్పుచుండ్రు

జారత్వచౌరముల్ చనవొప్పగాసల్పి
        జనవాదమొరులపై జాటువారు
తాప్పుమాటలఁ బల్కి తారించి వ
        తంటాల నోరులపైఁ దాప్పువారు
తప్పుదారులఁదొక్కి తమ్మునమ్మగలేమి
        పరులనమ్మగలేని బడుగువారు

సంశయంబులఁగుంగి చావుబ్రతుకు లేమి
సాధుల నేడ్పించు చవట గాండ్రు

అదుపు లేమిని దంటాల నాడువారు
కాము జేసిన దోసఁగుల దాచువారు
ఖేదశక్యముఁ గానిచో వీధిఁ బెట్టి
పెరలగుట్టుల రట్టుల బెట్టువారు

జగముల జన్మమేల ! పడిచావగ రాదొకో ! నీటమున్గిచున్
పగలనివారణంబు పలుపాటులనొంది మృతాత్ములై నిజం
బెగయఁ జికాకులేక నిజపీడలనారసి నస్తుపాటునన్
మగవిడిమంగ జీవనము వర్ధిల మేలనఁ రాదొకో ?

మదమున మీదఁబర్వి మధుమత్స్యపుమాంసము మెక్కినిక్కి సం
పదలను వమ్ముఁ జేసి పరబాధలవాడుఁ బెట్టి తిట్టి యా
లదనున కాసఁ జెంది పలుటంచుల మంచెలదాగిమూగి నా
ల్చెదరఁగ దామసంబుగను లీలఁ జెలంగెడు ధూర్తులుందురో ?

మత్తెక్కి క్రొవ్వెక్కి మత్స్యమాంసముఁ దిన్న
పలుగాకి వెలుగాకి పాపుఁడెవఁడొ !
ఇల్లాలి కల్లార నింటి బైటకు నీడ్చి
చాఁగొట్టిపోఁగొట్టు చవట యెవఁడొ ?
చెన్నారు పొన్నారు జీవభాగ్యంబుల
వెలివెట్టి యాల్పట్టు వెడఁగ వండొ !
తాత తండ్రులనాటి ధనధాన్యసంపదల్
తార్పుగాండ్రకునిచ్చు తంత్రి యెవఁడొ

వాఁడే జగమున పూలగంగడగుగాదె !
వాఁడె సుల్లాలి పెనుభ్రాత పాపిగాఁడు
వాఁడె పరబాధ నోసరించు పాడువాఁడు
వాఁడె దున్నంగ దూఁడగా బ్రదుకువాఁడు.

తన్నుదానై తిట్టి పట్టింపరాదయా !
దూర్తులకెదనుండి తొఱఁగవలయు
తప్పుదారులనుండ దండింపరాదయా !
పంచఁబడి యుండి బ్రతుకవలయు
పది మందిగూడంగ వద్దనరాద యా !
పలు తావు చీవాట్లు బడగవలయు
ఉద్రేక మంతగా నుండంగ రాదయా !
తామసంబున దెబ్బ తగులవలయు

వలయుఁ బనిచేయఁగా రాదు కలియవలయు
వలయు బాటలనుండిన వాగవలయు
వలయు వాగులఁ జీవాట్లు పడగవలయు
పడిన దెబ్బల శిరములు పగులవలయు

పంతగించినఁ బగబూనుఁ బట్టవలయు
బట్టిపగవాని సాధించి పరగవలయు
పరగి జీవంబు నిల్పుకో పథమువలయు
దారిదొరికిన ఘటమందు తప్పునుసుకు.

భీరము లేలా ! నాపై
గౌరవ మణగింపనీదు కాయముపోపోఁ

సారముఁ బీల్చెద నీదగు
పౌరుష మెడలంగ నెత్రు పారింతు నిదే !

రారా ! తొత్తులకొడుకా !
పోరా ! మదమణఁగ వేళ పొత్తున జేరక్
ఏరా ! కావరమున్నదె !
పీరాయిత మేడ్చెదేల ! వెఱ్ఱుల కుంకా !

వాగిన డొక్కలు జీల్చెద
దాగినఁ దరులందుఁగట్టి దండింతు నిదే !
ఏగిన వెనుకనె వచ్చెద
కాగిన నూనెలను బట్టి కాల్పింతు నిదే !

పసమిర కస గస మెక్కుచు
వస మెదడున నడియఁగట్టి వదరుచు బెదరక్
విసమస లడుకగ వినుగక్
వస జుఱ్ఱిన జుఱ్ఱుద్రావి వాతల నిడుదుర్

మదమేది పందిమేఘను
మదమెక్కిన నీమపొగరు త్రుంపింతునయా !
వదరుచు బలికినమాటల
బొదుపుగ వినియున్నవాడ ! పోతులపోత్రా !

నాదారి నీకుఁ జూపఁగ
వాడాలకు వచ్చుచుంటి పంతము దేలా !
దా ! దా ! దొరకితి విపుడే
దాదుల వెదుకంగఁ బొమ్ము తొర్పుల కొడుకా

నామాయ నీకుదెలియుగ
మోమోటమిమిూఅనుండి ముండలకొడుకా !
నీమాయ మట్టిగలిపితి
కామాదులదీడు విడుము కావరమణతుక్

పాపభయమును విడనాడి పరులపంచ
జేరి వాగుచు జీవాట్లు జెప్పుకొనఁగ
దొంగమాటలఁ గల్పించి తూగుచుండి
పొట్టగడుపును నీచంపు బొజ్జనింప

గ్రామసంచారముల్ కాపుసపాదుల
కానంద సందోహములను గొనుచు
సత్యాత్ములనగంగ సజ్జనగోష్ఠులక్
శాంతిదాంతులుగూడ సత్యమగును
ధీమంతులనగంగ ధిక్కార మొడలంగ
గంభీరహృదయులై గడుపుచుంద్రు
వాచాటు లూరూర వాగుచు దాటుచు
చాడీల బెదరింత్రు చవటలెల్ల

నీతినియమంబు విడనాడి నిలువలేమి
కుక్క మొఱుఁగుల చాడీలఁ గ్రక్కుచుండి
కాలిఁజూచుక యెమురొమ్ము గ్రక్కుకొనుచు
పొగరుబోతుల పద్ధతిపోవుచుంద్రు

శ్రీ ర మ

తల్లీ ! తప్పుల సల్పితి న్ననసునందాల్పంగ నాయంబె ! నా
కల్లోలాంతరమెంచు జీవితము నీకారుణ్యసంజీవమై
అల్లాడింపక ప్రేమఁగావగదవే ! యంబా ! నమస్కారమా !
కల్లల్ గావు నిజంబునుమ్మ ! హృదయాంకంబు న్నధిష్ఠింపుమా!

మాయలఁజేయలేను మధు మత్సరమూలానుట చేతగాదు నా
కాయము భస్మమై విడఁగ గాంక్షలఁగోరుదు దేవి ! గావవే !
మాయలబన్ని మూఢులకు మార్గముజూపి యమాయకుల్వడిన్
హేయపు దారులందువెత నింపుట నాయమె ! తల్లి ! శ్రీరమా!

ఆసలుమోసమయ్యె గడుపాసలు దోసములయ్యె వేసముల్
ఈసులు కాసులయ్యె వలపించుక పూసలు వాసులై వెసన్
మీసముదాసులై తళుకు వేసము దోసము కాసితంబులై
మోసము వాసితంబగుచు మోసపుబోరులనేసి దాలులన్

నిర్మలానందమా నిత్యసంపూర్ణమా
నీరాజహారమా నియతివీవు
ఆకారగుప్తమై యాకార-ప్రకటన
మాంతరంగికవృత్తి సలుపు దీవు
భావనాశూన్యమై భావప్రకాశమై
భవతారణంబునై భవములోసఁగు
ఆనందబ్రహ్మమై యద్వితీయంబునై
యైశ్వర్యయుక్తమై యైక్యమొందు
ఫలితవరలక్ష్మివై శుభఫలము లొసఁగి
యెన్ననైశ్వర్య ఫలసిద్ధి నిచ్చిభక్త

కాంక్షితార్థ ధర్మంబుల కరుణనిచ్చి
భక్తిపరులను గాపాడు భవ్యచరిత !

నినుజూడంగ మనంబుసుమ్మ ! నయనోన్మేషంబుగావించి నా
మనముం జూడగ నీదు మూర్తియని సన్మానంబుగావింప స
ద్ధనలక్ష్మీ ! భవదీయ పాదభజనల్ వాసింపనే తేరఁగా
ధనలక్ష్మీ ! సుకృతంబుగల్గెనిఁక నీదాస్యంబు జీవంబదా !

సంతసమందు నాహృదయ సారసపత్ర నికేతభృంగమా !
వంతము నెగ్గె నీచరణ పద్మనివాస ఫలైకనిష్ఠమై
వంతలువీగ నీకరుణ భక్తజనావళి రక్షణంబుఁగా
నెంతయు సంతసంబు మననేహిత కామితమొంది యుండుటన్

నామదిగాంచి యందలి యనామకమై చరియించు దుష్కృతి
న్నోమి పరంబుఁజూపి భవదుద్ధరణంబునఁ గావఁజూచి ని
ష్కామవిరాగధర్మముల సాఁకుగఁన్ ఫలసిద్ధి జేసి నా
నోముఫలింపఁ జేయుమని నోముల నోచుచు నుంటి శ్రీరమా !

వరములనిమ్మటన్న పురవాదవివాదము లెన్నొపెట్టి సొం
పరయుచు భక్తపాళిఁగని బాష్పజలంబులఁగాంచి మోదమొం
దరయము భావభక్తవర ధైర్యముగాంచఁగ నోర్వలేమి సం
కరములనెన్నొచేర్చి వెతఁగల్పనజేసిన దేవిఁగొల్చెదన్

మనుజునకెంచ నాశ్రమ తమంబగు రెండవ యాశ్రమంబుగా
ననెదరు పెద్దలంతెయని యాహితకర్మల నొందుచున్నది
న్ననయము నీతులన్నిటిని నాదర మొందఁగఁజేసి నిల్పఁగన్
వివఁగన ఘోరవస్త్య గృహక్షేమమొ! జంపతీక్షేమమో! విన్

పరభావంబున బూజసల్పి పరభావంబున్నది న్నెంచి స
ద్భావునింజేయఁగలేమి పోవుటయగా దన్యాయమున్నొప్పి నా
వరలక్ష్మి న్నెడఁజేయఁ గాంచెనిఁక నీభావంబదేలా! మఱిం
గరిరక్షించిన దేవుఁ గొల్చెదను గాంక్షల్ దీరమెప్పించెదన్

నిజముం గాంచిన భక్తి పాపములఁగన్నీటన్వడిం ద్రోలియు
న్నిజమొందంగ వికాసమాన వరలగ్నంబున్నదిం గొల్చి స
ర్వజగన్నాథుఁడు మోదమొంద సరళాభక్తిన్ భావంబులన్
భజనం దెల్పిన భక్తమోదము వడిన్ భద్రంబు గాంచుం జుమీ!

విమలమనస్కులై చెలఁగ వేదవిదుండెవఁబూని భక్తినిన్
సకలవరంబులిచ్చి వెతసంపుటకృత్యము జోకకింత చం
పకసుమజాజిజాతులను వందన పూర్వకపూజఁజేయఁగ
న్నెకసకెముల్ వెసంబరుప నేటికి ధన్యునిజేయు శ్రీరమా!

నీదర్శనంబున నిర్మలంబయ్యెఁగా
నిత్యైకజీవంబు నియతి దేవి!
వరధర్మసిద్ధిని ఫలియించెనా మోము
ఫలసిద్ధినొందించు భవ్యదేవి!
పారమార్థికచింత భవపాపతరణంబు
సమకూరె జనయిత్రి సరసిజాక్షి!
చరణైక ధామంబు సంతత వాసాన
సమయించె పాపంబు సరసహృదయ!
సకలదాక్షిణ్య భాగ్యవిశాలదాన
తృప్తిసమకూరె వరలక్ష్మి! దీనరక్ష!

సర్వసంపదల న్నభీష్టార్థసిద్ధి
ధన్యుఁజేయుము వరలక్ష్మి! దానలక్ష్మి !

భక్తపారిజాతక తరుసంపాదలగ్న
మానసంబున నీపాదమనన సల్పి
ధన్యతం గాంచ నీనామ ధ్యానగము
వేడుకొనుచుంటి దయచేయు వీరమాత !

దరహాసశోచిరుదంచిత వదనేందు
        భవ్య సందర్శన భాగ్యమబ్బె
నీరాజ చందన నిత్యదీపారాధ
        నాదాస్యకృత్య సంతానమబ్బె
నీపాదపంకజ నిర్మలధ్యానామృ
        తాపాన మధుర ధన్యత్వమబ్బె
సతతసంపదభాగ్య సంపాదనత్యాగ
        మహిమాతిశయ సౌఖ్య మాన్యమబ్బె
భక్తి పరతంత్ర జీవ భవ్యంబదబ్బె
సరసశృంగార భావనా జాతిమబ్బె
నిత్య సౌభాగ్య సంపదా నీతమబ్బె
అబ్బెనెంతయు నెరవేఱె నభవుఁడేల !

నవరాత్రి జపతపో నవదోషనాశన
        పరిపుల్లమయ్యె నా పరమతపము
నవరాత్రి వరలక్ష్మి నయభయబోధనా
        ఫలితంబు సమకూరెఁ బరమతపము

నవరాత్రి ధనలక్ష్మి నాణ్యసమ్మిశ్రిత
వాస ప్రవేశంబు ఫలితతపము
నవరాత్రిబోధన న్యాయైకభావనా
కావ్య ప్రదానంబు కర్మతపము
దశమి యేతెంచుచున్నదో ! ధన్యమాత !
విజయ మందిమ్ము తపముకు విజయమాత !
కరుణగావుము భక్తుని, గన్నతల్లి !
లలితనవరాత్రి వరలక్ష్మి ! లలితకీర్తి !

# మలియల



వనమాల

శ్రీ ఈశ్వరవత్సర దేవీ నవరాత్రులు

# బాలిగాఁడు

కలదొకపట్టణంబు బలు గాకులవారికి నిక్కగా జనా
కలితవిజాతులెల్ల నొక కర్జముఁబూనఁగ లేమి జాతిఁగా
దలఁపులు గాఁగనుండి పలుదారులు లేక యొకండు హద్దుపై
మెలఁగిచరింతు రందుకొని మేలములాడుచు నొక్కమాటఁగన్

వారల బాలిగాఁడొకఁడు పౌరుషవంతుఁడు భాగ్యశాలి యు
వ్వాలరపై నుడుగ్గొఁపి పంతముఁబూన విరోధిదాఁటరుల్
ఓరిమి నొందలేమిఁబడి యూహలఁబన్నుచు బాలిగాని నె
ల్లోరమియింపఁజేసి పలులీలల న్నుక్కణగింప నుండగన్

ఈయభిమానమెంచి యొక యీరమినారసి యుక్కన న్నిజా
పాయము వీడిపోవఁ గని బల్మిని బెక్కరఁబట్టి చంప న
క్కాయములెల్లఁ దేసువ వికావికబాఱ వితాకువీడుచున్
హేయములన్నిఁజేయుచు విహీననికృష్టపుఁజేష్ట లొందగా.

బాలిగాఁడు పత్తనంబునంగల మేటిజోదులు పలుమారల కహితుండు గాఁగా వారలు వానిందాకి ముష్టాముష్టి కేశాకేశి యుద్ధంబుల నొనర్చి యాపౌరులుక్కదక్కి వానిబాధల కాగ లేమిమఱి యబ్బాములకు భీతిజెంది చేయునదిలేమి

ఈ నడినెంచి బత్తి సకలేశ్వరిదేవి ననూహ్యశక్తిసం
త్రాసము వీడికొల్వఁబలుతావుల మానిసిపుంజాలొంటిమై
యీసునఁబుట్టి హెచ్చుమఱి హేయములన్ని వచించి పున్కఁబే
రాసలఁదెల్పనందు సకలాగత మానవజాతి పుంగవుల్

ఒక్క తావున గుమిగూడి వేదమ్ములబోడించి యావర
మేశ్వరి పరంజ్యోతిని మదిఁదల్చి

అమ్మా! యాపదనున్నవారము నిక్కమ్ముగాపత్తుఁ గాపాడి మా
యమ్మా! సొంపులఁదక్కియుంటిమిట భావానంద మావంత లే
కమ్మాయావశులైతిమింక నతఁడ న్యాయమ్ములం జేసి మా
సొమ్ముల్వమ్ములుసేయుచుండి యసువుల్ శోషింపఁగా జూచెడిన్

తల్లీ! యాపదలూష్మమమ్మ! సతముల్ చాస్యంబు వీడంగ వే
లల్లీ బిల్లులనన్నిఁబన్ని మముఁబల్లార్పంగ నున్నాఁడు సం
పల్లక్ష్మీ పదపద్మయుగ్మ సరణిన్ మా మానసంబుల్సదా సం
గొల్లల్ గాగ నుతించుచున్నవివె! నీ కూర్మింగడుం గోరుచున్

భావిఫలాప్తికై త్రిగుణ బంధవినిర్గత మానసాంశ సం
భావితులైనమేము గుణ భావిత కార్యసుమంగళేశసం
భావిత మానసాబ్జవర భామ మొనర్చి విశేషపూజలన్
ధీవర మాతృదేవి! నిను దీనత వేడుక వేడుచుంటి మో

నిన్ను మనంబునందలఁచి నిర్గత కష్టపరంపరాసుఖా
సన్నహృదబ్జ వీధి నుసన్నుత శాంతి ప్రదీప్తకాంతమై
సన్నుత సన్నవెల్గి కనుసన్నలఁ జాలిఁదలంచి యీ నరా
పన్నులముక్తులం బడయ బాధల దుల్పుము దుర్గ! భారతీ!

అనుచు హాహాహాళింబలుక నాయెలుఁగుల్వోని బాలిగాని నా
ధన మదగర్వితుం దునుమ ధాతమురారి పరాత్పరుల్వడిన్
వినయసరస్వతీ కలిత విష్ణుకళత్ర భవానులూతఁగా
నినద ఝణంఝణాకరణ నిస్వనజానక వాద్యనాదులై

వీగుచునుండ వారిమదులెంతయు ఖిన్నతవాఁడి దుర్భవో
ద్వేగమునిండవారు పలువీథుల మూలలసందుల న్నిటుల్
సాగుచుఁజూచుచున్భయము జంకును నెట్టెటొ యాపుకొంచురా
వాగుచుఁ బాలిగాఁడు వలెవాటులఁద్రిప్పుచు వారిఁగాంచుచున్

సమీపించి నమస్కారపూర్వకంబుగ పలుమాటల హేళ
నంబుగ నుడువుచు దేవతలార! నాపై గ్రౌర్యంబునహింపకుఁడు.
దుర్మార్గులవధించి లోకులకష్టంబుల నారసి జీవన్ముక్తిఁ జేయుఁ
డంచుఁ బల్కి నవ్వరజాతుండు త్రిమూర్తులకు జోహారు
లొనర్చి దివిజులార! మీరిక్కార్యంబునం జోరంబడుట హేయం
బుగాన మనస్సంకల్పనంబున సర్వంబు నారయుఁడీ! యనిన

తెఱఁగని వాసిరంత పరధార్మిక సజ్జనకర్మవాదులు
న్వెఱచుచు సందులంబఱవ విన్నదనంబున శత్రులంతయే
మఱికపటాలముంబనిచి మాఁడులఁబన్నఁగ నానవియ్యనా
కఱకు బుకారిగాఁడు పలుకాకులఁబోలె విదల్చి కొట్టగా

ఎంతకులేడు, మాయకల లెన్నియుఁజేయఁగ లేఁడు, సందుల
న్వంతులసేర్చి చీల్చి జమువాకిటఁబెట్టఁగ పీన్గుకుప్పల
న్నంతటి మాయలాఁడు, విలువారఁ జికాకునఁజీల్చి కొట్టనా
పంతపుబింక మొంది మఱి వారలు చాటులఁజింతలొందుచున్

ఒకరినొకరుగాఁ సాయమునొందుకొనుచు
నింటివరుసగ నొక్కొక్కఁడేగి పల్కి
యతనిఁజంపంగ నేగిరి యాతురతగ
బాధలొందినవారికిఁ బాటుఁదెలియు

బాలిగాఁడంతఁ బల్లెలపాదువిడిచి
చెట్లపాదుల నిలువంగఁ జింతిలల్లి
పాలుగాంగ్రడకుఁ దజి దెల్పి నాఁవుఁ దెల్పి
తరలె వనసీమఁ దిరుగంగఁ దాల్మినునఁగ
నందనోద్యా సుందరానంద మినుసు
డించు నొకరమ్యసుకుమార మెంచుఁ బువుల
గంధమాధురి వెదఁజల్లు కాననంబు
నోలిఁజొత్తెంచె వనమును బాలిగాఁడు.

అందుఁగల వివిధతరులతాగుల్మంబులకును, పుష్పఫలంబులకు, వనరామణీయకంబునకు, నలరుచు, జంతుసంతానభీకరసినాదంబులకును, సరీసృపాది విషధరంబులకును, మనంబునం బొగులుచు, నివాసయోగ్యమటఁ గానకున్కి, దైవసాహాయ్యమపేక్షించియు, వనచరులగు గిరాతుల వేషభాషణంబుల ననతికాలమున నలవఱచికొనియు, మనంబునం బెనంగు భయవిషాదంబుల నుబుకనీక, ధీరభంగి సంచరించుచుఁ గిరాతప్రేరిత నియమ వివిధకార్య ధురంధరుండగుచుఁ దన్నియుక్త కార్యముల ననన్యమనస్కుఁడై నెరవేర్చుచు, వారిచేయూతఁగొని, హృదయంబు డిట్టగాఁగ, నుండియొక్కతఱిఁ గిరాతులు లేకుండుట గాంచి లోకపూజ్యమాతయగు పరంజ్యోతి స్వరూపిణినిఁ దన పాండితీప్రకర్షయుద్ఘాటింపఁజేయుచు నాజనని శారదామూర్తిని మదిఁదలంచి భయాదుల పీడి నయాదులొంది నవనవోన్మేష సంతోష జలధినోలలాడుచు మైమఱచి తన మనంబునంగల కోరికలిగురెత్త నాకాననంబును బృందావనంబుపగిదిఁ దలఁచి యా దేవినిట్లని స్తుతియించు

తల్లీ ! శారద ! పూజనల్పకయు నీ దండంజరింపంగ నీ
కల్లానీదయఁ జూపకున్న బ్రదుకేమానో గదా ! భారతీ !
కల్లల్ గావు నిజంబుసుమ్ము కలిమిం గల్గింప నీయుత్తమా
మల్లుల్ తుమ్మెదలల్లు పద్మపదమా మాలచ్చిఁ గూర్పింపవే !

సరిగామాపదనీస లల్లుచు మదిన్ సాకించుటే లీలఁగన్
సరి కాలంబువిదల్చి కొట్టుదువె ! నీ సాన్నిధ్యభాగ్యంబె నా
వరకాలంబును పోకనియ్యక సదావాంఛం గదు న్మెప్పఁగ
స్వరదానంబులనిచ్చి ప్రోవఁగదవే ! వాణీశునర్ధాంగినీ !

సలుపుమునుందు నీతపము జన్యముగన్నది శిల్పి జోతిగ
న్వెలుగుచునుందుఁగాని హృదివేధలఁగాంచవదేమిరో కటా !
నిలువున నీరుఁజేసి పలు నేమము లేర్చి చరింపుచుంటినా
విలువు శరీరదార్ఢ్యమును ప్రేల్చుచునొచ్చుట పాడియౌనె ? నా
బలిమికడాయె సంకసు దపంబుల నొవ్వఁగ లేను భారతీ !

లోటుల నెంచ ధర్మమె ! విలోలమనంబు నరింపఁ జేసియా
పాటులదక్కఁ జేసి వరభావన బత్తులమాట యాచు నీ
బాటఁజరింపవచ్చుట యుపాయమె ? నీచమె ? నింద్యహేతువే ?
వాటుగఁ జూడకున్న నిఁక బత్తివిపల్వ నశక్తుఁడౌదు నే ?

అంచబుజానఁ గాలినిడి యంచితచంద్రశిలానఁ గూటమా
పంచవిశాలపింఛముల భావకటాక్ష విలాసహాసముల్
సంచరదంగభంగ కర చాలనవీణ నినాదరమ్యముల్
చంచలరాగమీలిత వశంవద హృద్యవిలాస గీతముల్

రాగాలాపనజేయుచున్న యాశారదామూర్తి పంచ
మరాగ స్వరవాహినీ కలధ్వని

వీనుల విందుగన్వినుచుఁ బెన్నిధులట్లుఁ దలంచి కుల్కుచుం
దీనతఁజూచుకొంచు మది తేఱక నెమ్మదిఁ బాదపద్మము
ల్మానసమందునుంచి పలుమాటల నిందలపాలుఁజేసి నీ
యానఁజరింపఁగోరి దొసగారఁగ వేడుచునుందు భారతీ!

ఆపుకొనంగలేమి నిను నారడిఁబెట్టితి నింతెకాని నీ
ప్రాపునఁజేరఁగా నదియుఁబ్రాప్తి నదృష్టముగల్మి సంపదల్
నీపనుపుంగనెంచి భుపినిర్మలభక్తిఁ జరించుటో! యెదేఁ
దాపునఁజేర్పుమమ్మ! వరదాయిని! వాగ్వరవాసినీ! ననుఁ

వాగబ్జానన! వర్ధమాన జగదీప్సా భావసంధాయినీ!
వాగాత్మాంశ సుభక్తదీను నిఖిలా వాఙ్మానసంబు ల్వడిన్
నీగీర్భావములన్ని నిల్పి మనము న్నీయాధిపత్యంబున
న్వాగారంభ మొనర్పుమమ్మ! సతిముఖ్ వాణీ! సదాచారిణీ!

కరుణఁదలిర్పుమమ్మ వరకామిత ధన్యనొనర్పుమమ్మ! నీ
వరభజనంబు నిల్పుచు నపార దాంబుజ మంత్రిరాజమౌ
భరితహృదబ్జవాసమును బాదుఁగనిల్పుచు దిక్కుఁజూపి నీ
వరములఁ జిల్కుమమ్మ! భవవారిధి దాటఁదరింపఁజేయుమా!

పూలఁగరంబులం గలిగి బుత్తిని బత్తిని ముత్తిఁగోరి నీ
లీల వినంగఁగోరి పలులీలలఁజూచి ముదంబుఁగాంచి నీ
కేళినినాత్మఁగోరి కడు కీలకమందజపించి పొంచి నీ
వాలుఁగనంగఁజూతు మది భారముఁదీర్పుము భారతీమణీ!

అని యిట్టిధంబున స్తుతియించుటయు నద్దేవి వరప్రసా
దంబున నందుఁ గొన్నిసౌధంబుల ధనాగారంబుల శారదా

మూర్తికటీరంబుల నేర్పఱచికొని, తోఁటిబలఁగములకుఁ గుటీరంబులనిర్మించి, నివాసంబొసర్చి, బోయల కనుకూలుండై వారలను వేషభాషల, ననుచరణంబున నిర్మించి, వారల నెట్టకేలకు దనవశుల గావించుకొని మేటిజోదై నాయకుండుఁగా నాకాననంబున కధిపతియై తొల్లిసేనలు బోయసేనలుఁగలిసి మెలసి తన్నుఁగొల్చుచుండ నంతఁ గ్రూరమృగనాశనంబొనర్చుచు, సతతవనమనోరామణీయకంబునకు మెచ్చుచు లతాతరుశోభలఁ దాము మెలంగుచు నిరతము వనవిహారంబొనర్చుచుఁ గాలక్షేపమొనర్చుచుండు.

వ న మా ల

మాది బహుజనపల్లి సమ్మాననీయ
మానవోత్తములుండుట, మాన్యవంశ
పూజ్యసౌభాగ్యంబునోట విబుధజనాళి
సంతతనివాస మౌట సస్యాభివృద్ధి

పుష్కలంబౌట వనలతాపుంజముంట
వన్నెచెన్నుల తీరుల కన్నెపగిది
నందచందాల సరిపోలు నతివలుంట
సాహసకాముఁలు నిరుపేద సాకుచుంట

సర్వలక్షణలక్షిత సస్యభాగ్య
యోగ్యజనసకలాఢ్య సంభోగ్యమౌట
వలదు నాపత్తనంబు సరాఁ

అనుచు కిన్నరస్వరంబున నేదేని గీతముం బాడుచు నొకర్తు వనలతలతామధ్యంబునసం జరించుచుండు. ఆపల్లె నివసించు నబ్బాల యిటుఁ జరింపఁ గారణం బారయుఁగా.

పల్లెలోపల పండితవంశమొండు
క్షాత్రతేజాన వెలయుట సాధువృత్తి
కవివరేణ్యులకందు సంభవముగల్గ
సూరవంశ సన్మూర్తి సచ్చారమూర్తి
నెగడె నొక యశోభాగ్య నిర్ణిద్రవర్తి

అతనికొక కూతురాబాల యార్యపటిమ
వెలయ సంసారవైరాగ్య విధివిలాస
గర్భదారిద్ర్య కష్టంబుఁగానలేమి
పల్లెకావల వనసీమ నిల్లువిడిచి
జీవముల ధరియించు సజ్జీవనియయి

బ్రదుకుఁ దెఱువునకై పరిపరివిధముల నాలోచించి యెట్టకేలకు అడవికట్టెల నుసురునిల్పుకొనవచ్చునని తలంచి తదనుసారముగ.

అడవి గట్టెలఁ గొట్టుచు నార్చుచుండు
మాలబాలిక కన్నీరు మలపుచుండు
దైవమేరీతిఁ దనకిఁక దారిఁజూపు
నొగడా! యంచుగష్టములోర్చుచుండు.

అట్లు మాలకన్నియ కష్టజీవితంబునకుం బొగులుచుఁ గన్నీరు మున్నీరుగ నేడ్చుచు నక్కాననమున దిక్కుమాలి

తిరుగుచు నిడుముల సైరింపంజాలక రయొకర్తుక దనకష్టంబులకుఁ దలయొగ్గి చండభాను నందనవేడిమిం దాళఁజాలక కాగిపోవుచు నాయడవిని గట్టెలఁగొట్టి వాని విక్రయించి తల్లాభంబుల జీవించుచుండు నట్లు

కడిమిపుల్లల మోపులఁ గట్టుఁగట్టి
నెత్తిమోయుచుఁ గస్సీరు నించి చెంప
బోగులుచుండగ చిత్తంబు బొచ్చెమనక
కట్టెలమ్ముచు కాలంబు గడపుచుండు
కాలమేరీతి గడచునో గద! నిజంబు.

పగటనిట్టులఁ గష్టాలఁబడుచునుండి
రేయియంతయు జీవితరీతిఁదలఁచి
సతతదుఃఖసముద్ర సంచారభావ
నాత్తకల్లోల జీవి హృదంతరాళ

భీతి, జీవితశేషంబు వెతలఁజెంది
దిగులునొందెడి తెలవార తిండికొఱకు
దినదినాదిక కృత్యంబు నెఱపుచుండు

ఇవ్విధంబున గష్టనష్టంబులొందుచు నబ్బాలయాకస్మికంబుగఁ బూర్వవృత్తాంతంబును స్మరించుకొనుచు నిట్లు విలపింపందొడంగు

రాజ్యమా! పోయె పెదతండ్రి జూల్లపడియె
తల్లిదండ్రులు దూరానఁ దగలుచుండ్రు

అమ్మయనుటకు నోరాడ దంతయైన
అన్నకును నాదుగతిపట్టె నకట! నేడు,

తలంచును వెక్కివెక్కి యేడ్చుచు గుండెలవియునట్లు
సొమ్మసిల్లి కొంతదనుక నేఁదేరి వెండియు.

అన్నయా! యన్నఁబరుగున నన్నుజేరి
జుట్టుసరుదుచుఁ జేఁబట్టి చూడ్కి నిలిపి
చెల్లి! భయపడవలదంచు జీరుచుండ
నెక్కడను లేని సాహస మింపుమీరు.

మాడలన్నియు నటుమాయ మనుతలెల్ల
రాజవంశమునందు వైరాగ్యమొదవె
రాజ్యకాంక్షలు మెండాయె రాక్షసత్వ
మెక్కుడాయెఁగదా యింక నేదిగతియు!

మాదువనమంత లేమాయె చూచిగున్న
లెట్టులుండెనో! గోమాత లేమియయ్యె
నోగద! శారికాశుకములు పొగులుచుండె
నేమొ! గతి యేది? దిశమాలి లేమనైతి.

మాదునుద్యాన వనలతా మంటపమున
నాన్నఁ బిలుచుచుఁ గోపించి ననలఁగోసి
యిమ్ము!— అమ్మచే జడను వేయించుకొందు
ననుచుఁ బల్కిన మాటలే యంతరించె.

పాపమంచును నాచెయ్యిఁ బట్టుకొంచు
నెప్పుడు రాచబాటలఁద్రిప్పి యింపుగలుగ

జోద్యమునన్ని జూపించి సోదిఁజెప్పి
విసుగుఁబుట్టించు నన్నయ్య విడిచెనన్ను

ఆటపాటల మాటల వాటుఁగలిగి
చెలిమి కలుముల సగపాలు గలిగియుండి
ఒక్కకంచములోపల మెక్కి యొక్క
ప్రక్కఁబండుకొందు మెపుడు నక్కజముఁగ

చెల్లి! యనఁగానె మనసున వల్లివోలె
భక్తితాత్పర్య మెడలింప శక్తిలేమిఁ
జుట్టుకొనియుండు సతతంబు పట్టుగలిగి
యణఁగినట్లుండి పెద్దయా యన్నకరుణ.

నాదుభక్తియుఁ గాలంబు నాశమయ్యె
నింకగతి లేదు సోదరుఁడెందుఁజేరె
నోగదా! యేగతులఁబడెనో కటారి!
గడియసేపంత నన్నయ్యఁ! గలియలేనొ?

దైవమా? నాకుగతిలేదొ! దారిఁజూపఁ
గరుణలేదొ! విశాలలోకానఁ బార
వైచిచూడవు? నిర్దయ వదలవలదె?
అన్నఁజూపుము జన్మము సున్నకాక

ముందె అన్నయా! రమ్ము! నామోముజూచి
పొమ్ము! కష్టంబులోర్వ సర్వమ్ము విడిచి
స్థిరనివాసముఁ గోరుదుఁ జింతవీడి
యాలసించినఁ గోరిక లంతరించు

మనములోకతూరి సంతసమందిదుఃఖ
సాగరంబునఁ ద్రోయుదు శాంతికొఱకు
అన్న! అన్నయా! సోదరా! అరిగిరావె!

చిన్ననాటి విశేషంబులన్నిఁదలఁచి
చేతిజేతినిఁ గలుపుక చేరితిరిగి
చాలచేష్టల నిముసంబు సంతరించి
వెడలుదము లెమ్ము! కాసేపు ప్రేమలొలుక

అమ్మ వేంచేయునపుడెల్లఁ గుమ్మలించి
నిన్నుబిలిపించి నాసేమ మెన్ని నీకు
నప్పగించెనో! లేదొకదా! విచార
మింతలేక యెట్లుంటివో? యెంచలేను

ఎచటనుంటివి! కష్టంబులేమివచ్చి
మానివైచితి ననుజూడ! మాటఁగూడ
గలుపనైతివి? నామది కలఁతఁజెందు
వచ్చిరక్షింపు మన్నయా? వనరుజెలిని.

నీవురాకున్న నామది నిన్నుదిట్ట
కోపమింతైనవచ్చు నాకోర్కెవినుమ
నింతవేడినఁగాని నుంతేనిదయను
జూపవేలకో? నాపైనిఁగోపమేల!

దిక్కులేదునాకింక నీదిక్కుగాని
ధైర్యమంతయు నడిపోయె తమ్ములరక్ష
ణంబెదిక్కాయె! శాంతార నవవిరాజ

మానమాధవుచెలిమి కుమార్తెనైతి
కృష్ణమాతల్లి గారాన గేసుచుండె

అయిన నాకెన్ని సౌఖ్యంబు లానియున్న
దయులతో కుమారినైన దాంతిశాంతి
సహజసిద్ధములై నాకు సహానవహాన
యోగ్యభాగ్యములైన, అయోగ్యములుఁగ

బరిగణించుచునుంటిని బాపినగుచు
నన్ను పానములన్నియు నదుకుచున్న
జింతమునిఁగి యెడాకును జెందనేగ
దొరుకదాయెను నాకెట్లు దొరలుగడువు.

అవియిట్లు వాపోవుచు నాలోచనా వివశయగుచు బొరలివచ్చు దుఃఖంబునణచికొంచు వెండియు మఱపునకు రాక రోదనంబొనర్చుచు సొమ్మసిల్లి కొండొక కాలంబులకుఁ దెలివిఁ జెంది నలుదెసలఁ బరికించి ధైర్యంబుదక్కి భీతిఁజెలంగుచు, నెట్టకేని కొంతవడికి నిసుమంత ధైర్యంబుఁజిక్కబట్టి యాలోచనాంతరంబుల నొక్కనాడి హాసించుచు గొంతివడి విచారించుచు బలుదెఱంగులఁ జలితమనస్కయైయున్న యబ్బాలి కామణి,

కన్నెవలపుల మొలివేయు వన్నెఁబరగి
వెన్నెలంబర్వు జిలునవ్వుఁ జెన్నుమీఱ
జందురుందెంటొప్పు నాచాన మోము
సోముకంబున వెలలేపు సొంపుఁజెలఁగు.

నా హరిజనసుందరమూర్తి యాశలుడిగి
దిక్కుఁగనలేక దైవమే దిక్కటంచు

వెనుకముందులఁజూచుచు విన్నఁదనము
మోమున నమర విన్నాణముడుగుసురిగి

కాలుముందుకుఁ గడువక కళవళించి
దైవమా! యేమి! తుదకిట్లు దారివిడిచి
పారవైచితి వనసీమ పర్వుఁదీయ
కరుణఁబూనవె! దైవమా! పరువునిలుపు.

అనుచు నదేపనింబలికి యార్చుచు నెత్తినిమోదుకొంచు న
వ్వనతరుపాద మూలముల వంతలచింతల నెగ్గునెత్తి య
ప్పనముగ నేడ్చివైచి యటఁ బండిన పూవుల యాకుసెజ్జలం
దొనరఁగ మేనువాల్చి కలిఁదూరుచు మైమఱపూరడింపఁగన్

మేను విదల్చి నోయన నిమేసము నట్టులఁగన్ను మోడ్చి య
మ్మానవతీలలామ పలు మాటలఁ బల్కుచు దీనచిత్తయై
కానలఁ గ్రూరజంతువుల క్రౌర్యముకుం దలయొగ్గివిల్చియ
ద్దీనజనావనిం గరుణఁ దేర్పఁగ గానమొనర్చె శారదన్

సరిగమపాదనీసయని సారెకుఁదీగెల వీణమీటుచుం
గరమునదీనఁ గావఁగ నగాధరసాంచిత భావపూరితా
వరితశుభావహాకలిత భావితమానసకాంతిఁజూపియా
వరములనిమ్ము తల్లి! యని వాంఛలఁ దెల్పుచు వాణివేడఁగన్.

పలుకులచాన యంతఁబదిపల్కులఁబల్కె విచారమేల! నీ
వలుకఁగనేల! బాల! పితబాపును గొన్నిదినాలలోన ని
న్వలచు విశాలభావుఁడగు బాలకరాజ్యరమావరుండు నీ
వలపుహరించు నమ్ము పితఁ బాపును పొమ్ము! విశాలలోచనా!

కలతల్ వీడ నపూర్వ సౌఖ్యచయసత్కారంబు వాఛించి నీ
లలితానేక వికస్వరాకలిత సల్లాపాప్తి గాంధర్వసం
వలితాగాధ విలాస భాసురమనో భావాత్మ సంధింపుమా !
లలనా ! భావతరంగడోలికలఁ దేలందేర్చు సద్భావుఁగన్

ఈవరభావముంబలికి యింగితరూపము దాల్పశారదా
భావము మానసంబున విభావనఁగుల్కుచు మోమునెత్తి సఁ
భావిత భావకల్పనల ధైర్యవిశాలగభీర చిత్తయై
యౌవనసీమ లీల దరహాసమెలర్ప విహారమొందగన్

కదలి విభావభావితవికారపరీక్షితమానసాబ్జ స
ద్వదనవిశేషహాసవర భాసుర కాంతి సమీహితాశలే
బదపడిఁగూర్చునంచు విరిపానుపుఁగూర్చి చరింపనూగుచో
వదరుచు జంతువొక్కటి గబాలుననార్చుచు వచ్చెనంతలో

దానింగాంచి విశాలకర్ణముల నద్దానన్ భయంబందఁగా
దానాంభఃకణముల్ స్రవింగఁగరియుం దానంబడన్ వ్యాఘ్రముల్
హీనాహీనమనంబుఁ గల్గి వనితాస్వేచ్ఛంబడం ద్రోచి యా
కానంగూలినగొయ్యఁజూచి పటుశక్త్యాప్తిగూలె న్వేసన్

అంతట నద్దిమయ్యయగునంచుఁ దటాలున మోముద్రిప్పియ
చ్చెంతల తెల్లుఁదాకిమతి చింతలవీడుచు బాల దాగ నా
వంతము ముమ్మరంబుగ నపారబలంబులఁ జూపి జంతువుల్
వంతున నొండునొంటేఁబగ బట్టుక చంపుకొనెన్ హుటాహుటిన్

నూతదూకి బాలవిచేష్ట నొంటివిడిచి
తాలఁబట్టి చంపున నాపతాలఁజాతి

శివిరి పూనికి జెల్లుపూఁదీవఁబట్టి
యొద్దుఁజేసుక యొకతరువూని సొలసె

అక్కట ! దైవమేగతికి నంపెనొ ! బాల విచేష్టయై పడం
బుక్కటనీటిబొట్టు సిడుబుఱ్ఱుఁడుగానఁగరాఁడు కానలో
నెక్కడబాలయింకఁగడు వెక్కడ ! జీవికి నేడుతీరెబో
నక్కరుణామయుండు సమయంబును వేచి తరింపఁజేయుడో ?

నాస న్నిశ్వసనంబులారవకటా ! నాయంబె ! యిచ్చోటనే
యాసల్ దీరెనొ ! లేదొ బాలకికఁ నాహారంబుప్రాణంబుఁగ న్
శ్వాసంబుల్వడిఁద్రిప్పవాడుగలఁడా జాజ్వల్యమానుండు నా
యాసంబుల్గణియింపకుండు పరమేశాత్ముండు గాపాడుతన్

ఆసమయంబునన్వడిగ నాడటబోయఁడొకండువచ్చి తా-
నాసరసాంగిఁగాంచి పదినారసముల్వడిఁబట్టి యేమి ! యీ
వాసన ! పీన్గువాసనయె! బాపురె! చచ్చినదో! పచారముం
జాసిన దంతిమాంసమిది మాలిక బాలిక భద్రమేగదా !

అనుచు నచ్చెరువందుచు నవ్వఁగొంచు
మోముసీటఁదడుపఁగ నెమ్మొగముద్రిప్పి
తేఱికనువిప్పి బోయనిఁ దేఱిచూచి
దయ్యమంచును భయపడి కొయ్యవోలె

కదలక కన్నుమూసి సడిఁగాంచుచు బోయఁడుచేయుసేవల
న్నెదలక చూచుకొంచు వెసభీతినివీడి తటాలున న్నిదే !
యదనునెఱింగి కాచితివి యాదృతినేమని కొల్చుదాన నా
యెదనుహరించి వేటతమి నెంచిభుజింపుము నాదుమాంసమున్

అ ను చు,

దీనతఁబల్క బాలఁగని ధీరుఁడునై తమకింపకుండ నీ
దీనతఁదక్కియుండుము విధిన్మఱిఁగొండఁగ వేడు బాలికా !
యీనది కేగి నీరమును నిప్పుడ తెత్తునటంచు నేగి యా
దీనజనంబుఁగాచి పటు తేజమెసంగ నడంచి దైన్యముల్

అంత నావనమాలిక దిగ్గననిలిచి యాకిరాతుంగాంచి అయ్యా! మీదయంగదా నాప్రాణదానంబుగలిగె. దిక్కులేని యీ దీనచరితినెట్లుగాపాడితివయ్యా ! జీవంబువోయిన నాకీ కష్టంబులు గట్టెక్కునుగదా ! సకలనాయకులనిల్పి జగన్నాటకమున నన్నొకకష్టజీవినిగఁ జేసితివిగదా !

అకటా ! ఎటులనీపాటులఁదప్పించుకొనుట ! ఏలజన్మించితి ? ఎట్లుజీవంబులధరించి దుఃఖాక్రాంతనగుచుంటినో దైవంబున కేయెఱుక. దిక్కులేని నాబోంట్లకు దిక్కుగదాయని పరిపరివిధంబుల విలపించి కన్నీరుదుడుచుకొంచు మఱల దుఃఖోద్విగ్నయగుచు నయ్యా ! మిమ్ముదైవంబు నాకడకుంబంపి కాపాడఁజేసి యార్తరక్షణఫలితంబు నీకొసంగెగదా ! కాన నిన్ను దైవసమునిఁగా భావించుచుంటి. ఓదయామయా ! ఆర్తశరణ్యా ! నాయీవందనంబులందుకొని యీబాలపైఁగనికరముంపుమని పలుకుటయు నాబోయఁడిసుమంతసేపు నిమీలితనేత్రుఁడై మఱలనున్మీలితుఁడై వనమాలా ! దుఃఖింపకుము. కష్టసుఖంబులు కావడికుండలవంటివి. జీవితంబులు నీటిబుగ్గలని నమ్ముము. కష్టంబులుతొలంగి సుఖంబులనతికాలమున రానున్నయవి. విచారంబువీడి కడచినకష్టంబులఁ దలంపక ధీరచిత్తవై

కతిపయదినంబులు కాలక్షేపమొనర్చుము. శుభోదయంబగు ననియాబాలనోదార్చి సుందరీ! యనతిదూరమునఁ బరబ్రహ్మ మహాముని బ్రహ్మాశ్రమమున నివసించియున్నాఁడు. వారి నివాసంబుననే యీకాననంబు పవిత్రమైనదని యెఱుంగుము. దానంజేసి యామునీశ్వర దర్శనంబు మనకత్యంత సంతోష శ్రేయోదాయకంబునని నుడువుచు

ఏమఱుపాటులేక మృగయేచ్ఛ జరించుఁ గిరాతుఁ డంతనే
ఝాముననోచితో! వ్రతము పాపముపోయి ఫలించె జీవితం
బీముని యాశ్రమంబున సఖీ! మఱియామునిఁగాంచి వత్తమీ
ఝామునఁబోయినన్మునియు సంతసమందుచుఁ బల్కుమాలికా!

అనుటయు నాకన్యారత్నము మనంబున నలరుచు ఆర్యా! మీకెదురాడుదానా? ఆమహాముని దర్శన భాగ్యము నాకబ్బుట నాపూర్వజన్మ సుకృతంబుగదా! నాకత్యంత శ్రేయోదాయకంబుగదా! కాని నాబోఁటి దిక్కుమాలిన మాలకు నింతటి యదృష్టహీనకు నామహాముని దర్శనంబు లభింపదేమో యని నాచింతయని యాబాలపలుక నాబోయఁడు మాలా! అటులఁబలుకవలదు. సజ్జనులకు నీచానీచంబులు భేదభావంబులు మచ్చునకుఁగూడ దొరుకవుగదా! అంతియగాక మహాశయులగు మునీంద్రులకు నట్టి సంకుచిత భావంబులు లేశంబులుగూడం గాన్పింపవని సర్వలోకవిదితంబు గదా! సర్వసమాన సౌభ్రాతృత్వసిద్ధియే వారికి పరమసాధనంబని యెఱుంగుము. మఱియు, నీమహర్షి దర్శనంబున నీకు

శ్రేయంబొడఁగూడునని నామనంబు తొందర పడుచున్నది. ఒండు విలమును భావింపకుమని

అనఁగ నదేమయా ! కరుణ నాదృతిఁజూపిన నీదయంగదా !
మునినిఁగనంగ భాగ్యమది మోదమె ! బాల మఱొండుగాదన
న్వినుము గిరాతుఁడంతవగ పేల! మునీంద్రునిఁగాంచుమంచునా
మునిపదపద్మ ముల్మనిని మోదములర్పఁ దలంచుచుండగన్

సంతసంబుఁ జెందాలా ! యాదివ్యాత్మదర్శన భాగ్యంబున నీ యిడుమలీడేర నాతని చరణకమలంబుల మదిఁనిల్పి నీకామితంబుఁ వచనసంభాషణంబుల వ్యక్తీకరింపు మనిన నాలలామ సిశ్చేష్టయై మనోగతాభిప్రాయంబుల నతనికి నెఱుంగఁబలుకఁజాలం. ఆర్యా ! మీావచనంబున నావాంఛితంబు లంకురించునవి కాని యమహాత్మునిసన్నిధి నెట్లుబలుకవలయునో ! యెట్లుప్రవర్తింపవలయునో గదాయని జంకుచున్నదాన నని నుడువ నాకిరాతుఁడు ఓబాలా ! యామునిపుంగవునియెదుట చనవుగల్గుమగాని భయమూనంగ యుఁగానంగ రాదు. సజ్జనులు పరహితాచరణమతులుగాన బహుశ్రేయోభిలాషులై చనవు గలిగి వర్తింతురు. అదియుంగాక, నీ కేమియుఁబలుకక యూరకుండుము. ఆమహనీయుఁడే సర్వంబును దివ్యదృష్టినారసి భూత భవిష్యద్వర్తమానంబుల నెఱింగి నీకు మనోధైర్యమొనఁగూర్పఁ గలఁడని నచ్చఁజెప్పి యొడంబఱచి పదంపడి మాలికాంగీకార ముంబడసి మునీశ్వరునకు నరిగి పర్ణకుటీరంబున నామహనీయు ప్రోలనిలువంబడి యతనికి సాష్టాంగప్రణామంబు లాచరించి యాపెచే నట్లచేయించి యాతనిచే దీవెనలంది మాలికా

వృత్తాంతంబును మునీశ్వరునకెఱుకపఱచి నిలుచుటయు నా మహానిపుంగవుఁడు,

నిలిచిన బాలఁగాంచి తన నేమములన్నియుఁ దీర నాసనం బుల నుపవిష్టులై యుగ్గుసు మున్గశిరంబును వంచి దైన్యచిం తలమదిఁగుందు బాలఁగని తాకీయిబూనుము మాలపిల్ల! నీ తలఁపులవన్నిఁ జేకురు నిదానము సద్గుణమన్నిటన్న్బవిక్

శాంతమనస్కవై భీతినివీడివర్తిల్లుము. మాబోంట్ల జప తపంబులు నీబోటిదీనజనసంరక్షణాముసకుగదా యుపయోగించు నవి. గత వృత్తాంతంబుల సర్మింయుంపకుము. గత విచారములకు వగవఁబని లేదు. ధైర్యంబుబూనిన నీ కనతికాలమున నీ యభీ ష్టంబులు సిద్ధించుగావునఁ గడిమిఁ జిక్కబట్టి వర్తింపుము. ప్రతిప్రాణికిని కష్టసుఖంబులు పర్యాయముగ ననుగతములై యుండు. అదియుఁగాక పూర్వసంస్కారవాపేక్షయై వాంఛా పరివృత్తియు గలుఁగుచుండు. తద్విషయంబున వివేచన యొక్కండు పరికింపవగును. డిగులుపడి బేలయె దురపిల్లుచున్న శరీరసౌష్టవంబుదక్కి నిరుత్సాహిణియై యవశ్యాచరణీయములఁ గూడ సరివేళమఱచి సంతతమశఖాక్రాంత యగుచు మహా కార్యంబులన్నియెను విడుచుచుండు. మదిని నుత్సాహమినుమ డింపఁజేసి ధైర్యంబువహించి నిజకార్యంబుల నప్రమత్తయై యుం డిన నెప్పటికేని సక్కర్జంబులు నెరవేరు. కాన బాలా! విచా రంబుడిగి స్వకార్యంబుల నెరవేర్ప ధైర్యచిత్తవై మెలంగుట శ్రేయంబని నుడివి మఱియు నబ్బాలికా మనంబున నూతన తేజము నెలకొల్పనలయునని తలంచి తదుత్సాహ ప్రాప్తికి నా బ్రహ్మర్షి యీ మాలికనిట్లుద్బోధించె.

శావున బంచమాబల ! యకారణదైన్యవిచారమేల ! యీ
జీవులకెప్పుడుంగలుగుఁ జింతసుఖంబులుగాన వీణపై
భావ వికస్వరాకలిత భవ్యసుకిన్నరగాన మాధురీ
భావనలల్లుమమ్మ ! వరపంచమవంశ విజాతి బాలికా !

గానమాధురి మృగములు వీనులలర
విందుఁగా వినుచుండు వివేకగరిమ
ఆశ్రమ నివాసజనులకు నాసఁగొల్పు
గానమాధురిఁ జిల్కుమా ! కంజనయన

అని మునిపలుక నామువుడ యించుక విన్నదనంబును నానయుఁ దమిఁగొన నేమియుఁ బాలుపోక యూరకొని తలవంచియుండ నాముని.

బాలా ! జాలమదేలా !
కాలాను గుణంబుసుమ్ము ! కారణజన్మం
బాలాపము వినిపింపుము
నీలాలితగాన మహిమ నెమ్మిఁదలిర్పన్

పరశ్రేయోభిలాషుల మగుమమ్ము తల్లిదండ్రులనుగా భావించి వ్రీడవిడిచి యథేచ్ఛగా నీయిష్టదైవంబును మదినిల్పి యొకగీతమున మమ్ము సంతోషపెట్టుమని పలుక నబ్బాల నూతనోత్సాహమంకురింప మునీశ్వరుప్రేమోల సంభాషణంబులఁ జనవుగలిగి ధైర్యంబుగలిగి నిశ్చలమనస్కయై తనవాఙ్మాధుర్యంబునిట్లు జిలుకరించు,

ధన్యురాలైతి నీ దయఁజూప జీవితం
బానందసాగర మందుమునిఁగె
భక్తురాలైతి నీ పారమార్థికచింతఁ
బరవశత్వంబున వరములొందవె
జీవికనైతి నీ జీవసాగరమందు
దరణమొందఁగ దైవదాస్యమొదవె
సేవకురాలైతి సేవఁ జేయుటఁబట్టి
పాదారవింద సంప్రార్థనమున

అఘముమటుమాసె దైవంబునఖిలమయ్యెఁ
జింతలొంతాయె మననసంసేవ వలన
వంతవింతాయె సుఖదుఃఖ బద్ధమగుట
సతిముజ్యోతిర్మయానంద ! సాఁకునమము,

అనుచు దైవంబుఁదలంచి మునీశ్వరునకు నమస్కరించి దేవీస్తుతి నిట్లుపక్రమించె,

దుర్గసంసేవాని సర్గఫలావాప్తి
నాపూజఫలియించె నవ్యశక్తి
ఈశ్వరీ పాదాంబుజేహితసౌభాగ్య
పూజావిధానంబు పూతభక్తి
యోగసంధాయకం బుదుగుణాధిక్యాంశ
మానసదానంబు మర్మభుక్తి
భావిభాగ్యవిధాన ఫలితవరంబుల
సంసిద్ధపూర్ణయాసతతముక్తి

విహితసేవానిరూఢనివేశచయము
నీదుపాదారవింద నిర్నిద్రభక్తి
సిద్ధులంద సదానంద సిద్ధినొంది
జోతిఁ గలియుదు విజితసంశుద్ధిఁ గోరి

నిత్యమా నామంబు నిరతము ధ్యానంబు
పంచాక్షరీ మంత్రపఠనజపము
స్థిరభావసంసిద్ధి సేవించి భక్తుల
కష్టాక్షరీమంత్ర మహారహంబు
నైశ్వర్యయుక్తమా నాయురారోగ్యంబు
ధన్వంతరీమంత్ర తపమొఘలము
భావనాసిద్ధమా భవహరణవిధంబు
నీనామజపార్థ నిత్యఫలము

భవ్యశక్తి విముక్తి సంభావ్యయుక్తి
కాళి నమ్మితి దుర్గమ్మ కరుణఁ గోరి
గౌరిపూజలఁగంటి సౌఖ్యంబునొంద
దేవి ! దయచేయుమో జోతి ? దివ్యపథము

ఇట్లు భక్తి పరవశయై స్తుతిరూపకముగ,

విమలవిభావన విలసితదేవిక్
అమల వరాంచిత హారపరిదాయిక్
కమల నివాసినిఁ గరుణదలిర్పక్
గమకపుఁబొందిక గానమొనర్చెక్

ఆగాననూధురికచ్చటి యాశ్రమంబునందలి సర్వంబునుం

అంతంబాటల తేనెచిల్కమన మాహ్లాదంబునుప్పొంగ న
క్కాంతంగాంచుచు నబ్బురంబువడి యక్కాంతార మధ్యంబున
న్వింతల్ చెప్పకొనంగ నప్పడతి గంభీరార్తి సంచిత్తయై
కాంతారంబు విడంగఁగోరి సెలవుం గాంక్షించె మౌనీంద్రునిన్

అనవడంగ నచ్చెలువ యావనసీమల నాశ్రయంబులం
దానవలోకనంబున వితాకు విడంగని వీడుచుండఁగం
దోనఁజరించు బోయఁడల తోయ్యలి వెంటఁ జరించుచుండి యో
చాన! యిదేమి వీడెదవు శాంతితపంబుల వీడనాయమా!

అనఁగ విచారమొంది విధి యానతివీడ భయాన బాలయా
ననవిలుకాని బెట్టిదపు నానమునుంగుచు నున్నదౌట న
వ్వనతరుమూల మందఁ దను బాయక నిల్చి మునీంద్రునాన నీ
కొని వనచారుఁదీసికొని కూరిమినాశ్రమ వాసముద్దుచున్

చూచినమోదయార్భట ప్రసూన వికస్వర శోభితంబు నా
దాచరి తామ్రవృక్షనవ హారితపల్లవభక్షణాల స
ద్వీచివలెన్సురాలహరిఁ దేలు మధువ్రత నాదవాదముల్
వాచకరామశబ్దశుక పక్షికులాది కలస్వరంబులన్

వినుచు మనోహరంబగు వివిక్త జనాగమనానుకూలతం
గనుచు విభావహావ వరకాంక్షలఁదీప్చు లతానికుంజము
న్నెనయుచుబొంచిడాగురుల నెంచుచునిమ్మల మెచ్చుకొంచునా
ననవితిబోఁడి తుమ్మెదల నాదముసం గడువెంచుకొంచు నా

మానవజాతి నాయకుని మానసమందు జపించుచుండ న
క్కాననసీమనొక్కయెడఁ గాతఁబెట్టు బిశాచబ్రహ్మము
న్నాననమెత్తిచూచి సెల వంచుఁ జలించి ధరాతలంబున
న్మ్రనుబడంగ బోయఁడు నిమీలితనేత్రుఁడు కన్నుఁదేరఁగా

గాంచి యిదేమిరా ! యిటకుఁ గావరమెక్కి జనంబుఁ జంపనీ
పంచకువచ్చినారా ! యిదె ! పౌరుషమీల్గబలంబుఁజూపియీ
వంచకు బ్రహ్మరాక్షసుని వంతలఁబెట్టి యమాలయంబున
న్నించిన నూనెగుండిగల నీఱ్వానవైచెద మిత్తిసత్తిలో

అనుచు బడాయిపోతు బకునాఱుపదంబులువేసి రక్కసుం
డనయమునాకు జోడుగ విహారమొనర్పఁగ నీడులేదిదే !
వనతరుమూలమందణఁగి వాదమొనర్చుచు వచ్చువాఁడిదే !
వినిశితక్రౌర్యమూల నఖభేదమొనర్చెద వీనిముందటన్

అనుచు బోయఁడు హుంకరింప నట రక్కసుడటునిటు గాంచి యెవరు కానక్కునిక్క సంతసించుచు.

ఇంతకుఁగానరాఁడు మదినెంతఁ దలంచుచున్నవాఁడో ! యె
క్కింతఁ దటాలునన్నరిగి యింతనె కిక్కురుమన్క చంపి నా
బొంతనునింపుకొందు మఱుఁ బూటకు రెండవదానిఁదెచ్చెద
న్నెంత యదృష్టమోగద ! యిహీ ! మదినాకలి దీరునంచు రాన్

వచ్చుచున్న రక్కసుంజూచి కిరాతుఁడుత్సాహంబున

వీఁడిదె ! నాదుపౌరుషము వెఱ్ఱితనంబున నెంచలేమి స
ల్లాడుచుఁ గూటికింగడుపు రాపిడి వచ్చుచున్నవాఁడిదే !

రాఁడుగదా ! మదాశ్రితము రౌద్రముఁ జూపి మదంబణంతునా
నాడుచు వెళ్లి రాక్షసుని నార్పఁగడంకను నేగె బోయఁడున్

ఇద్దఱునొక్కఁడంగదిసి హీంకృతి హాంకృతి నాదమొప్పఁగ
న్నద్దిర ! యంచు నిద్దఱు విహార ప్రకోపిత వీరులౌచు నా
బద్దినిఁ బోరుసల్పఁగ, వివాదము హెచ్చ హుటాహుటింగడున్
దద్దరిలన్ ధరారమణి తారొక్కని రేనుఁగు సింగమాయనన్

పోరుచునుండ రక్కసుఁడు పోటులగాటుమఁదాళ లేకయా
వీరుఁగనుంగవంబడక వేఱిడి మాయముగా, వనంబునన్
ధీరుఁడు బోయఁడంత ధర దీనతఁగుందెడు మాలసుందరిం
బౌరుషవాక్కులందనిపి బాల ! విభుండిదె వచ్చు లెమ్మనన్

పొలఁతి వితాకువీడి విభుఁబొందు నుపాయమదేమయా ! యన
న్నొలసితుఁడై కనుంగవ వివిక్తముఁజేసి యిటేగి పిల్చుదు
న్నలతరుమూలమందు నిజహారము నాఁగఁ జరించుఁద్రాచుపుం
గలఁతఁజెలంగ వద్దు వరకాంతల తన్వొసఁజూపు తేకువన్

అట్లాలతను జేతఁబడికొనిన నీకపాయంబేమియు నుండదని వెండియు,

దానింజూచి భయంపడంగ వలద ద్దానంద్వదీయార్థముల్
దీనాదీనజనార్థముల్ ఫలములౌ దేదీప్యమానంబులై
ఈనీచుండిల నీదు రక్తమును, నిన్నే ! త్రావనుంకించునీ
నానానందిగ పీడిసొమ్ముపడఁతీ ! యర్థంబు సిద్ధించుతన్

పలికి కిరాతుఁడంత నల పంచమబాల నమస్కరింప నా
కలికి మిటారిదీవెనలఁ గామితసిద్ధులనొందబల్కి యా
కలకలలాడు నెమ్మొగముఁ గొంచుచు నెమ్మదిగారవించి యా
స్థలమని వేటఁగాఁడు తమజాలములో నరిగెన్ విజేతయై

పోవుటఁ గాంచి బాల యట భూతమెయుండునొ! యంచుభీతయై
కావుమటంచు దైవమును ఘాతుకజంతువునుండి యంచు నా
పావనమూర్తి బోయఁడటు ప్రాణముని ల్పెగదా! యెటేగెనో!
యీవనపుణ్యమూర్తియని యెంచుమదింబటు ధైర్యసాహసుఁ.

అసువుల నిల్పినాఁడు మఱి నాదటమానముఁ గాచినాఁడదే!
హసిత వికాసపద్మనయ నాంచిత హావవిలాసభాసురా
వసితమనోహరాకలిత వాంఛ బయల్పడనీక నామనం
బెసఁగఁ జరించినాఁడు వల పేపుఁగనెంచినవాఁడు యోగ్యుఁడే!

అతని విడంగ నామనసు నాతురతం దపవోక నెమ్మది
స్వాతజనియింప నున్నయది వేఱిడి నైచరియించి నాతనిం
బతిఁగ వరింతు నింతకు నభాగ్యగనైతిని, డించి దేవ! యీ
సతిఁబతిఁగూర్పుమంచుఁ బదిసారులు చెప్పుట బేలనాడుఁగా

అంతటి భూతమందలఁచి హైన్యదశావన నీచవృత్తికి
న్వాంతలఁ జెంది మేను భువిఁ గాయుక మున్న, విధేయచిత్తనై
పంతము మీఱ దేవుని నపారసుభక్తిని వేడికొంచు నే
సంతత దైవయత్న ఫల సంతతిఁ గోరుచునుందు నెమ్మదిన్

బోయఁడొసంగినట్టి పరపుష్పితకాంతలతాసహాయునై
మాయలమర్చమెంచి పటుమాంత్రికుఁ గెకొని దారిఁబోయి యే

లీలలెఱుంగశక్తుఁడె ! నిలింపవిభుండును బ్రహ్మయేని, నీ
కేళినిఁదెల్పఁ గావు వరకీర్తి విశారద ! మానిచంద్రమా !

అల్పమతి న్నినుం దెలియ నాదృతినెమ్మదిఁ దెల్పయుంటి నీ
స్వల్పముఁదెల్పి నీయది విశాలవికాస కులంబుఁదెల్పి సం
కల్పముఁదీర్పుమయ్య ! వరకల్పుఁడ ! నీదయఁజూపి నామది
న్నిల్పుము కామమోహిత సునీతి వరంబులనిమ్ము ! ధీవరా !

అనుచుబల్కెడు వనమాల నారితేరి
కనుచు దరహాస వదనేందు కాంతి బర్వ
నబల ! ధైర్యమూనుము విను మార్యుఁడనఁగ
రాజచంద్రుఁడు వేనచ్చు రాజితాంగి !

వెతలనడంపుమా ! వెఱపులనారసి
        వేసారియుంటివే ! వెఱ్ఱిపడుచ ?
కలఁతలడంపుమా ! కలకాలమిట్లుండు
        నే ! బాల చీకాకు నెంచవలదు
వలపులఁ బెంపుమా ! వలరాజుసోయగం
        బలరంగఁ గేరు నీవలపుఁగాఁడు
పలుకులఁ జిల్కుమా పంచమస్వరమునఁ
        గోకిలారవముసంకోచమూన

రాగమంజరి విరిదావి జాటుదేలి
పేర్మిఁ గనకంబు గంధంబుబేసుకొనఁగ
వలపుకొల్లల మలయుచు వంతదీరఁ
గలుపుఁగొట్టుతనంబును గలుపుకొనుము

సీరాజు శేరాజు నిలువునఁ బట్టించి
సిగపూవుగం బెట్టి చెలఁగుచుండు
నీపతి యహిపతి నీలహారముగాఁగ
మేననందంబుగ మెలఁపుచుండు
నీభర్త రతిభర్త నిలువునీరుగ జూచి
బూదిఁగానొనరించి పొంగుచుండు
నీఘనుఁ డల గంగ నీటుఁగ దలదాల్చి
వాటుగఁగరుణించి పంచుచుండు

నీగురుండల వృషభము సాగఁగొనఁగ
నిత్యలీలావిహారంబు నెఱపుచుండు
నీవిభుండు దాక్షాయణి నిల్పుమదిని
సతిని వనమాలగాఁజేసి సాఁకఁగలడు

నిన్ను వలంచినాఁడు పెఱనిల్పగఁ గోరఁగలేదు నీమదిం
దిన్నగఁ జొచ్చినాఁడు కడు: దెంపుననీదయఁగోరినాఁడె! యిం
కెన్నటికేసి నీదరి నహీనదయారతిఁ దేర్ప నీదు సం
పన్నకులీనతందలఁచి భాగ్యయశంబులనొందు మాలికా!

బేలవుగాకు నెమ్మదినిఁ బ్రీతివహింపుము బొంకుగాదు ని
న్నాలిగనొందఁజూచి వలపాపుకొనంగ వితాకుఁజెంది నీ
శీలముఁ జూడవచ్చి పలుసేవలునీకు నొనర్చి యేగినాఁ
డేల! భయంబునీకుఁ బరమేశుఁడె నిన్నువరించె మాలికా!

# భారతభూమి

శ్రీమించు రమణీయ ప్రేమనివాసంబు
యోగ్యభావాప్తిసం యోగపదము
భాగ్యసంపూర్తి సత్ఫల విధానంబు, ధ
న్యాత్మసంశుద్ధి విన్యాసభవము
భవకర్మసిద్ధైక భవ్యయశస్సుధా
కలితభోగ్యవిభావ ఘనవిధంబు
ఘనవిధానంబుగాఁ గారించుశీలంబు
శీలంబుమించిన చిరయశంబు

నిత్యధామంబు విజ్ఞాన నియతిగృహము
జ్ఞానమిశ్రితయోగ్య సంచార క్రమము
చలనసూచిత జీవిత చరఫలాప్తి!
బరగుదురు, జనుల్, ఫలభూమి, భరతభూమిఁ

సతతకల్యాణ సంసర్గవిభూతిసం
భవభవభూతి సుపావనంబు
అనఘ నవనవోదయారంభ ఫలప్రాప్తి
ధనధాన్యసంభుక్తిఁ దారణంబు,
సోదరపరభావ సోదరసమభక్తి
మానుషఫలిత సమ్మానసనంబు,
జీవైక సర్వజీవావన జ్ఞానవి
భావనా యోగ్యతా ప్రాభవంబు,

ప్రకృతికల్పనా విస్ఫూర్తి ప్రజ్ఞాదీప్తి
యోగ్యవిద్యల జ్యోతిస్సు యుక్తిసాత్త్వి
కనిజ ధర్మసంస్థాపనా ఘనతఁగాంచి
భారతంబును దలఁచినఁ బడయుజయము

జీవనయోగ్య సంసిద్ధకర్మారంభ
సత్యధర్మాచరచ్ఛాంతిపథము
సుఖదుఃఖసమభోగ్యసూత్ర విజ్ఞానవి
శాలవిభావనా శాంతివిధము
షట్కాదిశమనసు షట్కాదికామాది
సుఖదుఃఖభావనాశోభితంబు
సంసారజలనిధి సాంజీవనయుక్తి
తరణపరంజ్యోతి ధన్యపథము
త్రిగుణపంచేంద్రియాదిష్ట దీపితంబు
పరమనిశ్చలజ్ఞానైక భవ్యచరిత
పరమయోగీంద్ర విజ్ఞానభాగ్యమనఁగఁ
బరగుభారత మిలఁగీర్తి భవ్యజయము

పందసముఁటయున్న బాలగోపాలక
వర్గంబునకునీటు భరతభూమి
ఈడుగాదఁట మున్న నీమహాసంపదల్
అమరావతిం గెల్చు నార్యభూమి
జోడుగాదఁట మున్న సుందరోద్యానవి
శేషరాజితము సంసేవ్యభూమి

సాటిగాదఁటయున్న సౌఖ్యభోగము లన్ని
సుఖభోగకరణంబు సుబుధభూమి

ఎన్నశక్యంబె! యీభూమి నెంతకైన
దేవమానుష పాతాళదీపకులకు
బొలుపుఁజెన్నారశోభిల్లు బుణ్యభూమి
బొగడశక్యంబె! యీభూమి పుణ్యభూమి

పావనజీవితావధికిఁ బండిన మేలు బవంతి నాగర
త్నావతిధీమతిం గొలువ శాశ్వతభాగ్య విశేషసంపదల్
భావిత నిత్యకర్మసుఖ వాసవిశేష వివేకసంఘన
ద్భావనలల్లు దేశమిల భారతభూమి యొసంగుభాగ్యముల్

భరతభువిం బువుల్ మెరుగు వావిలిఁజాలు మెఱుంగుబొమ్మనా
బరగు మిటారికత్తియలఁ బర్వినపోడిమి నీసడించి చం
దురునగు మోమునం దరిమిఁ దోరఁగ మేడలఁ జెట్టవెట్టి సం
భరితవిలాస హర్మ్యసుధ భాసిలనొప్పును నూఱువన్నెలన్

బంగరుమేడ లుప్పరపుఁ బందిలితీవెల పొన్నుహొన్నులం
బంగరులై యొసంగు బసివాఱు బవంతులుఁగల్గి చూపఱం
జంగునఁగేళిఁ జేయుఁబలు జాయలలందుచు నెక్కసక్కెముల్
రింగునఁజూచి మేల్పసిమి రేతిరిరాజును గల్మి హీయనన్

ఐశ్వర్యసంపద న్నఱచేతఁబట్టంగ
నాహ్నికంబుల నిత్యయాజ్ఞగాఁగ
ధనధాన్యసంపదం దడవఁగాఁ గోకొల్ల
సత్యశాంతాదుల జాతియనఁగ

జీవహింసాహీన చిరభాగ్యమాయన్న
జిత్తమేపారు సంజీవియనఁగ
ఆధ్యాత్మికంబుగా నహరంబలరంగ
శక్తిస్వాతంత్ర్యంబు వ్యక్తియనఁగ
విమలసౌఖ్యవిధాయివివేకభాగ్య
ధైర్యశౌర్యవిశాల సంధానయుక్తి
మెలఁగునార్యబుధాళిసంచలన మిలను
దురవగాహాన సౌఖ్యాన దొరలుజ్యోతి

హారిజనుఁడు

నిజభుజధారణంబు నరినిర్జిత సర్వముదావహంబు సం
భజితనిగర్వధైర్యవశ పార్థివబృంద విరాజమానమై
గజరథసైన్యవేగతురగంబులు నై సుఖమందు మానసం
బజితవిరాగమై చెలఁగె నాహితకర్మధురీణ వాహియై

హారిజన బాలుఁడక్కడ నయాచిత లబ్ధఫలార్థియై సదా
శరణముఁ జేసికొంచుఁ బలు వాడల వాడల నర్థిఁ దెచ్చిసాం
పరయ ధనాధినాథులను నర్థిగఁగోరి సమస్తవిద్యలన్
సరిగ నేర్చి పామమున సాఁకుచునుండు విధేయుతన్ వడిన్

మనమున భావించు మానవజీవితం
బాశలనడుగఁటు నధమబుద్ధి
మానవభేదంబు మతమంచుఁ గల్పించి
మాటుమాయఁ జేయించు మనుపుబుద్ధి

మతమన నిష్టంబు మనుజువ్యక్తిత్వంబు
అభిభావధర్మంబు నార్యబుద్ధి
మను జువ్యక్తిత్వంబు మనవఁ జేయుఁగనే
కైకభాసంబు పఠించుబుద్ధి

వ్యక్తిపరమాను స్వాతంత్ర్యయుక్తి గాంచి
పడుగుచుండెడి మానవభావబుద్ధి
మారిపోవుట వింతఁగ మాయనోలె
వెలయుచుండెడి నీజాతి వింతయనఁగ

బాపలఁజేరి వారి మతభావవిశేషము లెల్లఁగాంచి తా
పాలిపితజాడ్యమందమతభావవిహీనత జేసు నెంచి స
త్ప్రాపితభావముందలఁచి ధాటుగ నీస్థితియున్కిఁగుంది సం
తాపముజెందునా హరిజనాదరపాత్రుఁ డులోనఁ గ్రుంగుచుఁ

ఏవిధి దీనిభావమత మెంతు విశేషుల నాయుపోన్నది
న్నావిధి పూజసల్పి సరిమాావిభు నెంచి విడగ్ధనాజ్ఞ చే
నీవిధిఁ దెల్పు భావనల నెంచుఁడి ! జాతిమతాధి పండితుల్
మీవిధిఁదెల్పి లోకమున మెప్పొనొందుఁడు పండితోత్తముల్

సరిగాంచి గ్రంథాళి సంచితభావంబు
నరయుఁడీ ! నియమంబు నార్యులార !
వేదచోదితజాతి విధులగాంచినచోట
వెల్లడిఁజేయుఁడీ ! వేత్తలార
బ్రాహ్మణారణ్యక గ్రంథాళిజూపఁగవద్దు
వేదప్రమాణంబె విజ్ఞులార !

ఋగ్వేదసరణిచే ఋజుమార్గమరయంగ
  తన్మంత్రసారంబె! జాతబాల!

ధర్మశాస్త్రపురాణ సద్గ్రంథములను
జూపకుండుఁడీ! కాలవిచోదితములు
దీనిభావంబు దెలియంగ ధీవిశాలు
రలరుచుందురు సంతాపములఁ బరయ్య!

స్థావరజంగమంబులన ధారుణివస్తువు రెండగా సదా
భావన బారణంబులయి పార్థివవస్తు విశేషమారయన్
పావనమై వెలుంగుచును భావనవీడి చరింప లేమి చే
నీవిధిగూర్చె నందుఁ బరమేశ్వర నిర్మితబుద్ధి ధీరతన్

మానవకోటి నెన్న వరమాన్యత జంగమమై వెలుంగు వి
ద్యానిలయంబు జంగమము ధారుణిబుద్ధి నిగర్హణంబులం
బూనిక సర్వవిశ్వ పరిపూర్ణ విశేషము లారయంగ తన్
జ్ఞానము దక్షమా సకల జన్మమృతుల్ దెలియంగ నోగదా

ఎన్నియొ చెప్పనేల! పరమేశువిలాసపు లోకనాటకా
లన్నియుఁ దెల్పు బుద్ధి పరమాత్మవశంవదుఁడై చెలంగఁగా
బన్నిన లోకనాటకము భవ్యనిరూపిత మిందు లేదు సం
పన్నకులీనులై జనుల భావనఁ జేయఁగలేని లోకమా

జీవము భారమై సకల జీవులఁ జేరి చరించి సంగతిన్
వావిని జేసికొంచు వరభావములొల్క విధాతఁ జేరి దు
ర్భావకులై చరించు భువి పంచనజీవులఁ జేటదెల్పి ని
ర్జీవము జేసి పాసిచను జీవపరాత్మ నికేతనంబునన్

తంత్రము

హేయము గాదె! భేదమున హీనము కల్మషవస్త్రపంకముల్
కాయము నిల్పఁగా బహు సుకల్పనలల్లుట పాడియౌనె! హో!
న్యాయము బుద్ధికొక్కగతి యాతన సత్వమ్ముగాది కొక్కటౌ
బాయుట జాతికంటకుల బంపుట కాలగృహంబు హీనమే!

పారమార్థికచింత భావింపుమనుటయె
నీచకాయంబుకై నీతియగునె!
తల్లిదండ్రులసేవ ధార్మికత్వములుంట
కాయంబునిల్పఁగ ఖ్యాతియగునె!
ధర్మంబులరయంగ మర్మకర్మంబుల
ఘటమునిల్పంగ విఖ్యాతియగునె!
దేహంబువోవునో! దేవునిగొల్వంగ
దేహినిల్పంగ ధీరమగునె!

మాంసభూయిష్ట వసపురీషాంసజటిల
హేయమై కండపుట్టల నీల్గుచుండు
కాయమును నిల్పనాసించి కల్మషంబు
కటిల వర్తనులైయుండ్రు కుమతులెల్ల.

ఘటమున కాశఁజెంది కలికాలపు జోద్యములెన్ని సల్పిహో!
పటమున కాశజెంది పలు పట్టుబులుంగుల జంపనట్లఁగం
దటపటపాడుచుం బరుల దండలజేరి వసించి వంచనల్
దిటముగ జేయునీచులకు దేవగణార్చనమేలకో! భువిన్

ఒకచోటఁ గలహించి యొకచోట హింసించి
యొకచోటఁబోట్లాడి యొంటినుండు
ఒకవైపుభుజియించి యొకవైపుగూర్చుండి
యొకవైపు నిద్రించి యొంటినుండు
ఒకమాటుగుప్పించి యొకమాటగల్పించి
యొకమాటుదార్పించి యొంటినుండు
ఒకసారిపరుగిడి యొకమారు నిలుచుండి
యొకచక్కి దుఃఖించి యొంటినుండు

ఒకని దార్పునిజేసి దానొంటినుండు
నొకనిదూలించి తామేలు నొంటినుండు
నొకని గుణమెన్ని చీవాట్ల నొంటినుండు
దామసుండిల దూష్యుండు తంత్రిగాడు.

మంచిచెడ్డల నారయ మానిగాడు
కష్టసుఖముల నడప నిష్కామిగాడు
పరులదూషణభూషణ పరుఁడుగాడు
వెఱ్ఱివలె దిరిగెడి నవివేకిగాడు

నా య కుఁ డు

పగతుర గెల్చి రాజ్యగత భాగ్యవికాస విలాససంపదల్
అగలికనొంది విశ్వభువనాధిపుడై పరతెంచు వైరిలో
కగణ విభీతుఁడై యొసగెఁగార్యవిశారత పౌరుషాదులన్
బెగడిలు వశ్యరాజుల వివేకధనాఢ్యసహాయులై చనన్

పరివృత రాజలోకపది భావన నొప్పి జగాదరుండు సం
భరణ ధురీణుఁడై సకల మానవపూజిత పాదపద్ముఁడై
గరువ మొకింత డక్కి నిజకార్యనిమగ్నుఁడుగాగ రాజ్యము
న్నరిభయమింత లేమి సదయామతినై వెలుగొందు భోగియై

దానివిటంబు జేసికొని దండనశిక్షలఁ జేయు దైవమీ
దానదయాజపంబులకుఁ బాఁ దయజూపక వార్ధకంబునన్
దీనపరాఙ్ముఖుండయి విధింబడి యాతన కష్టమొందఁగం
గానగ రాదు కుత్సితుల కష్టములార్చుట న్యాయమయ్యెనో !

ఇంతఁగ జేసి కాయమును నెంచి వరంబుల నిచ్చి పెంచినన్
వంతలఁ జెందుచుండు బహువాంఛల గోరుచు నుక్కడించుఁబ
ల్వింతల జేరి నీచములఁ బూనికనెంచుచు నీసుబూనుచున్
గంతుని బాసనూని బహుకష్టములోర్చి చరింపనాయమా !

కామక్రోధాది సంగాతమై లోభమో
హంబుల మాత్సర్యకాందెదీవు
సప్తవ్యసనముల సాఁకుచు బొంగారి
సర్వంబు నాశంబు సాకుదీవు
అష్టకష్టంబుల నార్పి సంసారంబు
నైశ్వర్యమొప్పంగ నిలుపుదీవు
పంచపాపంబుల బటుభక్తి సేవించి
పల్వింత లొందింపఁ బరగెదీవు

చపలమొక్కటి దరిజేర్చి సంచలించి
దురితమొక్కటి సాగించి దుఃఖపెట్టి

కాయకల్యాణ మొనరింప గదలిజీవ
రథముపై దుర్మదుల గూడి రాజువాదు.

ప్రేమించి కామించి ప్రియజనావళిఁ జేర్చి
పొంగార కేళింత పొంగుదీవు
నిజలీలమెఱయించి నిల్వనఁ గొంపార్చి
మాయనేర్పులఁ బోరఁ జేయుదీవు
షట్కాసప్తకముల సాఁకుచుజీవితం
బావహిల్లగ జేసి యరుగుదీవు

మాయనేర్పులవీడి నీమనువు నొంది
సజ్జనంబుల వీడుట సత్కృతంబు
దంబువిడచుట కష్టంబు దాంతిశాంతి
నీదుదుర్కీర్తి నణఁపంగ నిల్చుచుంద్రు

పారమార్థికచింత పరమదర్శనముల
ప్రాణంబునిల్పంగఁ బ్రాకులాడి
ఏకాంతసేవల నిహపరంబులఁ దేల్చి
జననమరణముల సాగనంపి
సద్గోష్ఠినీపూజ సల్పి ప్రేముడిఁ గొల్వ
కర్మరాహిత్యంపు మర్మమెరిఁగి
జ్ఞానకాండలనమ్మి జర, భవంబులద్రోలి
మోక్షసామ్రాజ్య సంమోదమొంది

నీడనిల్పుట కాసించి నీదుపూజ
నిర్మలమనంబుతో గొల్వ నిండుదయను

నాదువాంఛను నెరవేర్పు నవ్యమైన
ఫలితసిద్ధిని జేయుమా ! భవ్యచరిత !

ఈవిధిమానసంబున నహీన విశేష పదార్థవాదముల్
భావమునందలంచి బహుభావన లెన్ని ! యకుంఠితాశలన్
శ్రీవరుజిత్తమందునిచి సేవలఁ బూజలఁ బుష్పపత్రముల్
వావిరి నక్షతల్ వెలయు భావవివేకునిగొల్తు నిచ్చలున్

జాతి

భీకరాకారమై వెఱ్ఱియాకారమై
వెలయంగ వినుచుందు భేదజాతి
అభిమాన గర్వమై యాధిక్య కార్యమై
ఆవరింపఁగ విందు నధికజాతి
కాయంబనియతమై కాంక్షాప్రధానమై
గతభావమును గంటిఁ గాయజాతి
పాండితీ మిశ్రమై వ్యాపింపభూతమై
మనువునిల్పఁగవిందు మనుజజాతి

ధర్మశాస్త్రప్రభాసంబు దారిజూపు
నంచువిధినియమించును నార్యజాతి
వికటభావ విశేషమై వేదబాహ్య
జనులఁ జరియించు మతమునుగనుచు భువిని

గొప్పఁగాఁదలపోసి గురువంశమును నిల్పి
శుశ్రూషసల్పుచుఁ జోద్యమెల్ల

వేదపాఠంబుల వినఁగరాదంచును
వెలివేయుభాషణ వెల్లియెల్ల
బ్రాహ్మణారణ్యక వ్యాఖ్యానపరమంచు
ప్రాపించు పరనార్థ భావమెల్ల
మన్వాది ధర్మంబు మన్నించు దురితముల్
కాయంబు నిలబెట్టు కాంక్షలెల్ల
కనుచువినుచుండు మనుజాత కఠినతయును
కర్మకాండల భోగముల్ గాంచునపుల
భువిని మతభూత తతిగూడి పొగులఁజేయు
దానిమటుమాయఁజేయంగఁ దవిలియుండు.

కాలము

దేవతామహిమంబు దేవాదిదేవత్వ
మహితభూతములన్ని మరుగుజెందె.
జ్ఞానైక వేద్యంబు జగదధికారంబు
ప్రకృతిభావంబులు ప్రళయమయ్యె
శ్రీపరంజ్యోతిస్సు శీలస్వరూపంబు
భావాత్మతేజ మాభాసమయ్యె
త్రిగుణాత్మపురుషార్థ ధీరసత్యశమంబు
లవకాశవిరహితం బభవమయ్యె
దయ యహింసాదులన్నింట దాగియుండె
సతముజోతియు నిస్తేజ సమయమొందె
సాధుభావరాహిత్యసంసారమయ్యె
విలక్షకలికాల చోద్యంబు వినగవలదె!

దివ్యతేజస్సునడుగంటఁ దీవ్రమయ్యె
దూరదృష్టియు శ్రవణంబు దూరమాయె
వికటభావంబు పొంగారి పెట్టియయ్యె
నీసుతనమయ్యె బరబాధహెచ్చునయ్యె

మానవత్వము మటుమాసె సంసార సా
గరనౌకపై ప్రీతి కామమయ్యె
దాంపత్యభావంబు తరలె వేషంబుల
డాంబిక వాదంబు టక్కులెసఁగె
ప్రేమరహస్యంబు బ్రికలి కౌగిలియయ్యె
నియమవిరహితంబు నెగడహెచ్చె
అంతరంగిక ప్రేమ యుటమటమయ్యె నీ
జాతిదాస్యంబు విఖ్యాతమయ్యె

నైకమత్యము ననురాగ మణఁగికరిగె
తెలివియెక్కుడై యజ్ఞాన తిమిరమయ్యె
గర్వడాంబిక వాదంబు ఘనతదెచ్చె
బహువితండ వాదంబులె వరములయ్యె

సత్కారి

యోగసమన్వితాశ్రయమహోత్సవపూర్వ జితేంద్రియంబులన్
సాగ గుణత్రయంబు పురుషత్వము రంజిల పంచమట్కముల్
వీగిన సప్తకంబులను వీడియు నష్టనవాంఛిత బ్రహ్మరుద్రులల్
జోగిగ ద్వాదశంబులను షోడశకాంతుఁడవై వెలుంగుమా !

నానాదిగ్వలయంబు దీప్తివెలుఁగఁగన్ భాస్వత్ప్రభాజాల సం
తానానల్పనికామ కాంక్షఫల దానప్రాప్యసంభావ్యమై
యీనాహృత్పథమందునుండు భవప్రతీశ ప్రభా తేజ మిం
పూనన్ సర్వకలావిలాసజగతీ పూర్ణైక్యమై భాసిలున్

హేలాభావము భాసమానముగదా ! యీశుండె నిత్యుండుగా
కాలాతీతము హేయమయ్యెనుగదా ! కాంక్షా విలాసాదులే ?
లీలాభావము నీచభావముగదా ! లేలిహ్యా భోగాదులే ?
హేలాకాలవిలీల భావముల నిత్యేశున్ మదిం గొల్వుమా !

సల్లాపంబును సత్యభాషణము విశ్వవ్యాప్త సత్కీర్తులం
గొల్లల్ గాగ సుబుద్ధిశాంతిదముల్ గోపాలసచ్ఛేష్టలున్
వెల్లుల్ గాగ విశాలభావముల ప్రావేశంబు సద్భావనల్
పెల్లుల్ గాగఁ బ్రభావసూక్ష్మపరి సంవేద్యంబు భావింపుమా !

పారసమానసంబు వనజాభరణంబుచు రాజహంసమై
వారివిశేషముల్ దవిలి వారదసూచక తృప్తిజెంది యిం
పారఁగజీవనంబు గొని భక్తి ప్రపత్తుల జెందుచున్ ద్విజా
ధారముగాగనేలుచు నిధానము జూపుము రాజహంసమా !

నియతి విధానంబు నిత్యైకధామంబు
నిత్యజీవనమయ్యె సత్యపథము
మానసరాజంబు మనువంశధీకంబు
హితకారికార్య మహాస్యపథము
సాధుకరాజ్యంబు సత్సంగ శుచిదంబు
సాయుజ్యధామంబు శాంతిపథము

ధరణీనివాసంబు ధనధాన్యఫలితంబు
మనుజరాజంబు జీవనపథంబు

సరస సర్వజ్ఞ ! భద్ర సంచారితంబు
సకల ఫలధాన భాగ్యసంసార పథము
నిర్మలామోద మోక్ష సన్మిత్రవరము
సహిత భావచతుష్షష్టి సత్కలావి
లాసధామంబు గంభీర భాసురంబు
విధివివేక సంసేవా నివేశనంబు.

భావంబుగాంచిన భావనిధానంబు
లోకచరాచర లోచనంబు
మానంబుగావంగ మహితశైవంబుగ
మానవరక్షణ మానితంబు
జ్ఞానంబునొందంగ శాంకరమార్గంబు
ప్రకృతివివేక సంపాదితంబు
జన్మంబునొందంగ శైవసంబంధంబు
ధనధాన్య భోగ సంతానభవము

శ్రీలనొందగ గుణనాథు సేవనంబు
చెన్నుమీరఁగ లక్ష్మీసచేతనంబు
మహిత భాగ్యవిధాయకు మననజేయు
ప్రాజ్ఞుఁడిల గొల్చి సేవించు ప్రకృతిజగతి.

జీవితనిత్యత జీవుడునిత్యంబు
దేహామునిత్యంబు స్థిరముగాగ

దారసుతాదులుదరి జేరియుండరు
దేహినిర్వాణంబు తిరముగాదు
ధాన్యధనాదులు దారిజూపఁగ లేవు
భాగ్యభోగంబులు పరగవెపుడు
స్నేహంబుమిత్రంబు సేవింపఁగా రాదు
మృషజెందు సర్వంబు ధిషణకెపుడు

జీవితావధి గడుపంగఁ జిద్విలాసు
భార్యఁబుత్రులఁబోషింపఁ బరమశైవు
ధాన్యమిత్రుల నొందంగ ధనదమిత్రు
బుత్రుగొలువంగవలయు సత్ప్రాప్యపదుని

నిర్మలసేవాధీరుఁడు
కర్మవుమాయంగ నిత్యకామవిగతుఁడై
మర్మవుఁ దెలిసి వివేకము
ధర్మవుగా వెలయుభువిని ధార్మిక బుద్ధిన్

దేహంబు సిద్ధింపఁ దిరముగా దేవేశు
ధ్యానంబు నియమంబు ధన్యుఁజేయు
కాయంబు నిలుపంగఁ గమలాప్తు సేవింపఁ
గష్టంబుదలగించి కాంతుఁజేయు
కరయుగ సార్థక్య కమలేశు ధ్యానంబు
సర్వపాపవినష్టి జరుగజేయు
పదకర్ణ నేత్రముల్ భావాత్మ సేవింప
కామక్షయంబులై కళియఁజేయు

వేదవిధి నిరవద్య సంవేదితంబు
కాంక్షితావాప్తి సందీప్తి కాంతిశాంతి
మానసాహితమర్త్యుఁడై మానియగుచు
కాలమిల గడుపంగ సత్కారియగును

సదాత్మ

మనమొకభావమందలరి మాయవిదూషితమై చెలంగి పా
వనచరితంబు గాంచిపటుభక్తి వినాయకుఁ బూజఁజేసి యా
చనధనధాన్య భాగ్యధన సంపదలొంది విభూషితాత్ముఁడై
వినయగుణాధినాథుని వివేకకలాప్తుని గొల్తుఁబేరిమిన్

హృదయ గుహాంతరంబున నహీనపదాంబుజ మింపుగొల్ప సం
పదల నొసంగ భక్తపరిభావన వాసము నిశ్చలుండునై
యొద నుపవిష్టుఁడై సతమునిల్వఁగ నూతనభావగీతిచే
కదనమునన్న రాతిశయగర్వమడించి చెలంగి వర్తిలున్

పరిభవజాయమాన పటునాద సమర్థిత యుక్తిచాతురీ
చరదరిమానసాంతర ప్రచారితకంపితగద్గదస్వరా
భరణవిలీన దుఃఖిత వివర్ణముఖారుణ నేత్రయుగ్మసా
దరణవిహీన భ్రూభ్రుకుటితస్వరకంప ప్రతాపమొందుమా !

ధ్యానము

పాపాత్ముండ భవత్పదాబ్జభజనావాస ప్రబుద్ధుండ నా
పాపాంతంబులఁ బాపుమా! నిరతముల్ శాంత్యాదిసద్భావునిం

గాపాడంగదవే ? స్థిరంబుగనవే ! కాళీ ! మహాశక్తి ! సం
తాపంబుల్ విడనాడి భాగ్యకలనల్ ధన్యాత్ముఁగాఁజేయవే !

నీ వేదికక్కని నమ్మియుంటి భజనల్ దివ్యాత్మఁగా భావనల్
నీవాసంబుఁగ నిల్పుచుందు నిటనే నిత్యాత్మభావించుచున్
శ్రీవాసంబు భవాంతకంబు వరసంసేవానివాసంబు స
ద్భావానంద విలాసభాసుర పవిత్రత్వాంశ సంరూపమా.

దేవదేవుల పూజల దీప్తిఁజెంది
నిత్యకర్మల నిరతిచే నియతిఁదలఁచి
పూర్వసంస్కారఫలితంబుఁ బొందలేమి
జడునిభాతివిచారించు జాడ్యమతిని

నిరతాధీన విశేషభావకలనా నిర్మగ్నసందీప్తిసం
భరితానేక విలాసకోటి పరితాపాన్వేషణాంధ సా
గర కల్లోల తరంగకోటి ఝుషితిన్ గాఢాంధకారేంగితా
చరితాశేష భవప్రసంగవిధి సంసారాశ భావింపుచున్ !

దీనజనావరాచరిత ధీరకలైక విశేషపూర్తిసం
లీన భవాబ్ధి సౌఖ్యచయలేహ్యావిధాన నిమగ్నజీవి, సం
తానవివేకభేదచరిత్రమ నిష్క్రమణా సమర్థ సం
ధాన విలీన పాశితతిధైర్యవిలుప్తిగసంగఁజూడుమా !

ధన్యతనొందె జన్మము ముదావహామయ్యోమనంబు నీ దయన్
ధాన్యధనంబులొందితిని ధారుణిఁగాంచిన వజ్రరత్నముల్

ధన్యునిఁజేసి నన్నునిఁక దానరమా వరలక్ష్మి, గూడి చై
తన్యమునొంద నీచరణ దాస్యము నమ్మి చరింతుబోధినీ !

ఇరవుగఁజెంది సర్వప్రతిభేహంతచారణసంకులంబు ని
స్సరదభివంద్యమానవరపారసమట్లు చరించి దేహమం
దరయుచు నాడినాడికి విహారమొనర్చి నిజాంశముంచి సం
భరితదయాకటాక్షముల ధన్యునిఁ జేసితి ! దేవి ! బోధినీ

విద్యా వివేకంబు విద్యా విహీనంబు
జ్ఞాన మజ్ఞానంబు సరిగఁజెల్లు
స్థిరధీర కార్యముల్ చిద్విలాసంబులు
సాఁకును నొకచోట శాంతిదాంతి
సమయ విస్ఫూర్తియు సమయ విజ్ఞానంబు
ప్రతిభా విశేషంబు పరిఢవిల్లు
భూతాది కరుణయుఁ బూర్వసంస్కారంబు
జ్ఞానకర్మంబులు జరుగుచుండు

వివిధ భూతవిశేష వివేకకలన
విపరిణామంబు ప్రతిప్రాణి వింతనొందు
జనము గనలేదు వినలేదు సాఁక లేదు
ధాతసృష్టికిఁ బ్రతిసృష్టి తరమె ! వెదుక

ఆశగల్పించుటే యవధియయ్యెనుగాని
యీడేర్ప తనవంతు నియ్యఁగొనఁడు
భావనల్లుటే పారమయ్యెనుగాని
పరిణామభావంబుఁ బడయలేఁడు

ధీశక్తినిచ్చుచో ధీరుమయ్యెదగాని
ప్రకృతి విజ్ఞానంపుఁ బ్రాపుగనఁడు
సంసారజీమూత సారపుటుఱుములకా
వికలాంగుఁడై దిక్కు వెఱవులేమి
శ్రీపరంజ్యోతినిఁ జద్విలాసంబుల
సేవింప విముఖియై సిరియు లేమి

బీదసాదలఁదరిఁ జేరి బ్రదుకుచుండి
కష్టనష్టంబులొందుచుఁ గార్శ్యమొంది
మానమభిమానమును లేక మందునివలె
వికటచిత్తుఁడై తిరుగు నా వెంగళప్ప!

సృష్టి

జీవితంబును గడుపుట చిత్రమగున!
స్వోదరంబును బూరింప సుకృతమగున!
దారపుత్రుల దయఁజూడ దాతయగున!
చిత్రమయ్యారె! నీచంపు సేవగనుట.

చింతవంతల నిసుకంతఁ జెప్పఁదరిగి
యుండుచుండుట హైన్యంబు గుమతులెల్ల.
చింతజీవులు లేకుండఁ జేతిదెబ్బ
లన్నిబొందుట చూడమె? యిలఁతిజనము.

బుద్ధియొకమాఱు వికసించి మోదమొందు
మతియునొకమాఱు మాంద్యంపు మమతఁజెందు

జ్ఞానమొకగతిఁ గుందుచు సందియంబు
నొంది నిశ్చయంబులఁ దేలు నొప్పమించి
జీవిజీవికి భేదంబుఁ జెలఁగుచుండ
రూపగుణబుద్ధులందలి రూపెఱింగి
పూర్వలబ్ధ సంస్కారంపుఁ బొత్తుదెలిసి
సృష్టియొనరించు నాబ్రహ్మ చిత్రమొప్పు.

సరసపద విలాసంబులఁ దేలన్
వరఫలసిద్ధి ప్రభావములీలన్
పరగుణ భావన పావనకేళిన్
ధరవరగుణిగా దాల్చుదు సిరులన్

కోవిద వరజనగుంభిత పదముల్
గోవిందునిమది గూర్మిని చెలువుల్
భావాంతర నిజ భావన పదముల్
భావిఁ దెల్పుచు బరగున్ వరముల్

నవరసవాహిని నవభవ్యంబుల్
కవిజనభావిత కాంతిప్రదంబుల్
భవహరసాధన భరనివహంబుల్
చవిఁగ వివేకము సాకుసమంబుల్

నికరశుభంకర నిర్మలచరణా
అకలంకాత్మక ! అఖిలైకగుణా !

వికట విమతులన్ వేంకట కరుణా!
సకలాఘములన్ సమయింపుగుణీ!

సవనహవిస్సుల సరగునఁగొనుమా!
భువన విబుధులన్ బొంగుచుఁగనుమా!
భవహరసుగుణా! భరమునునుపుమా!
నివహాసుబుధులన్ నిత్యముగొనుమా!

నాజన్మంబుల నాజీవితమున్
భాజనమొందఁగ భరియింపుననున్
నీజతఁగూడిన నిత్యముజగమున్
ఓజగదీశా! యోర్మిగలియుదున్

బుద్ధి ప్రకాశంబు భువనైకదామంబు
బుధసమవాయసమ్మోదపథము
జ్ఞానవికాసంబు జాతినిర్భేదంబు
ప్రాణికోటినివాస భవనపథము
స్థైర్యనివాసంబు ధైర్యవిరాజంబు
శాంతిసత్యాది విశ్రాంతిపథము
పురుషార్థసాధ్యంబు భోగవిలాసంబు
ధనధాన్యసంపూర్ణ ధన్యపథము

వ్యసనశత్రు నివాసంబు వాంఛితంబు
పరమవిజ్ఞానదీపికా భాసురంబు
నిధులనైశ్వర్యసంయుక్త నిధిగజేయు
శ్రీపరంజ్యోతి భవ్య సంసేవ్యపథము

ఆగమాధ్యయనంబు నైశ్వర్యయుక్తంబు
  నగ్నిసంస్కారంబు లంటరావు
ధర్మశాస్త్రంబులు ధనధాన్యసంపత్తు
  లన్నదానములన్ని యంటరావు
కల్మషసత్వంబుఁ గాంతిడాంబికవృత్తిఁ
  గరుణజూపెడు మిష నరుఁగరావు
బంధుమిత్రాదులు భార్యాసుపుత్రులు
  ప్రేమభావుకులుకూడి వెంటరారు

ధర్మచైతన్య మొక్కటి దాంతిశాంతి
సత్యరూపమహింస సజ్జన విహార
భాగ్య సంస్కార రూపంబు ప్రాణమొకటి
మోక్షసామ్రాజ్య మొందించు ముదముగొలుప.

స్పష్టచైతన్య చిద్విలాసాంచిత
  ప్రభవైకహారతి ప్రాభవంబు
సర్వజీవాధార సంచారవేగ స
  జ్జితవికాస సుపరంజ్యోతిభాతి
నిష్కల్మషాత్మనిర్ణిద్రపృథ్వీసృష్టి
  చిత్రాంకసంభూతి శేషఫలము
పంచత్వ జాతిత్వ పారమార్థికహీన
  నిర్వర్ణ్యగంభీర నియతివరము.

ఆత్మ పరమాత్మ రూపవిహారధీర
ఖచిత్రితానేక సార సమ్మేళనంబు

భావతరంగిణి

నియనిరూపవిశాల సందీపితంబు
భావవిస్ఫూర్జితాత్మ సంప్రాథవంబు

భావవిస్ఫూర్తిగనిపించు భావనాశ
ధాన్యధనముల భాగ్యవిధానసాశ
సౌఖ్యజీవన నిర్మిత సారసాశ
సుఖనివాస సంభావిత శోభనాశ

నియతిఁగూర్చును మానవ నీతిజగతి
మానగౌరవ నిర్మిత మననజనన
భూతి కాధారమెంచఁగ భోగతతికి
నార్య సంప్రదాయంబును నరయుఁడెపుడు.

నిందాస్తుతి

మోసము మోసమయ్యె వర మోదవికాస విలాసపూజః
ప్రాసితమయ్యె భారమునఁ గాలవిశాల నిరూపితంబుగ
శ్రీసతిమోసపుచ్చెనిఁక సేవలపూజల సల్పనేలకో !
వీసముగాదలంచితివె ! వేదవిధిజ్ఞ ! యరణ్య శోకమే

మీపూజ ఫలసిద్ధి మీదయావరసిద్ధి
సంసిద్ధిఁ జేకూరసాఁకెనంచు
జీవబాధలఁజెంది సేవనిత్యముసల్ప
జీవికవృథయయ్యె సేఁగియొసఁగ
బ్రదుకుఁదెరువుల నీ పాదమగ్నజపము
బారమార్థికచింత పాపమయ్యె

నాశానిరాశలో నడుగంటఁగూల్వంగ
సమకట్టి తయ్యోయి సౌఖ్యముడుప
కరుణ కరుణమయ్యోని ! నాకు గంజనేత్ర !
భారమయ్యోనె నాపూజ శారదాంబ !
విన్నతనముఁనుగూర్చితో ! వేదవిదుషి !
వందనంబిదె ! గొనుమమ్మ వాణి ! దేవి !

౹౮ఁజెలంగితంచు గురుసేవలసల్పి చరించిపూజలన్
వేలఁగసామగీతల వివేకమునొందుజడత్వముద్గినిన్
గోలఁగ బిచ్చమెత్తవెత కుందఁగనీల్గఁగ కాచితిమ్మ !
లీలలెఱుంగ లేకయు విలీనమనస్కుఁడనైతి నీదయన్

దూరము జేయునేల ! మది దూఱుట దేల ! నిజంబు దెల్పియా
కారణ హీనజన్మవృథఁగా వెలయుంగ వికాసహీనమై
ధారుణిసల్పితమ్మ ! వెసఁదారకమంత్రము నార్పితమ్మ ! యీ
భారమునీక దేల ! మది పాపచయంబుల నిల్పనేలకో !

భువినిజనాటకంబులను బూటఁగ పూడఁదలంచి జీవిప్రా
భవమొనరించి తీవు పరిభావనలల్లుచు మోసగించి యీ
యువయువ భార వేషముల నల్లుచుఁజూచి హసించెదీవు సం
భవసుఖదుఃఖముల్ జెలఁగ మానులకుల్పెడి మోసగత్తెవో ?

మానము ప్రాణముల్ విడిచి మాయవిడంగ జపించిపొంచి స
మ్మానమునొంద నిచ్చఁగొను మానసహింసకు బాటఁదప్పఁగా
హీనముగాఁదలంచితివి హీనపు దుష్కృతినీకు న్యాయమే ?
దానరమాధురంధరుసి ధాన్యధనాఢ్యునిసల్పు వెప్పుడున్

## సం సా ర ము

భారసంవాహన పారతంత్ర్యముఁబాప
సమకట్టు సంసారసాగరంబు
సత్యదూరాధిక శాంతివిహీనంబు
సమయించుఁబాప సంసారజలధి
నిత్యమాయాజాత నియతి నిబర్హణ
పరిమార్చు నిస్సార భవపయోధి
నాటకఖేలన నటనావిశేషముల్
సాగనంపుటయ సంసారవనధి
స్వోదరంబునకాశించి సుతులవీడి
దారవిడుచుట నీచాతి భారమరయ
కర్మవందురు బుధులు వికారమనక
హైన్యనైచ్యంబులందుట యాటయయ్యె.

## తి ర స్కృ తి

ఆలుబిడ్డలఁజూచి యావురంచును నేడ్చు
చుట్టపక్కాలతో సురుగుచుండు
అభిమానమానంబు లాశింప నీతోను
ధర్మబుద్ధియుఁ గడ దారియగును
తల్లిదండ్రులఁ జూచి తలగొట్టుకొని యేడ్చు
సోదరాదులఁజూచి సురుగుచుండు
బీదసాదలఁజూచి బెగ్గడిల్లుటఁజూడ
బంచత్వమే మేలు ప్రాణితతికి

హేయజీవన మారణ హీనపుగుచు
వికటమార్గంబు ద్రొక్కుట వెరవు లేమి
బ్రదుకుజీవుడ ! యంచు సంపాదనంబు
లుడిగిచచ్చుచుఁ బుట్టుటయోర్మివిడుటె !

లలిత రసాల వాఃభవ లాలిత భావతరంగ జాత సం
కలిత విభావహావ పరికల్పిత మానస జీవనాంతసం
చలిత సురాజహంసతతి చారణయోగ్య నటత్తరంగ స
మ్మిళిత విహారభూమి వరమేదుర భాగ్యసుఖైక రాజ్యముల్

మా ర్గ త

భువనములంజరించి వెసభూరివికృత్యము లాచరించుచు
న్నవమతి బెక్కుతావుల విహారమొనర్చుచు సత్క్రతుల్ క్రియల్
సవన క్రియాపరంపరలు సజ్జనమాని విహారభూములుఁ
వివరముగాఁ గనుంగొని వివేకముడిగ్గి యనార్య పద్ధతిఁ

పీఁడగడంగి వేధలఁబవింగొని భూధరపత్త్రముల్ వడిఁ
మూఁకలుగా విడంగవెస మూర్కొని గొట్టిన భాతిపింసలఁ
దేశవస్తుక్కిపొఱుచు విదీర్ణ మనస్కులునై చరింపఁగా
మూఁకలఁబంపి చెండుదురు మోఱకులెల్లరు బండరాళ్లచే

అన్నా ! నాయమెయిట్లు బాధలమచు న్నన్యాయహింసాత్మకం
బన్నా ! కావలె నీ ప్రజాహితులనన్నా ! బాధ లొందింపఁగా
విన్నాణంబులవీడి హింసలను నీ వేధల్ భరింపంగమా
కన్నా ! శక్యముకాకయున్న యపి మాయల్ పీడివర్తింపుమా !

ఏపనిఁజెప్పినన్నదియు నేగతిఁదాల్చిన హింసహీనమై
యాపనిఁజేసి వాదములనాగఁజరించి విధించు నాజ్ఞలన్
బాప విహీనమానటులఁ బాయఁగఁజేయుదు మే విధిన్వెసన్
ఈపరహింసఁదూలియు భవేప్సిత సత్క్రియ నాచరింపుమా!

రక్కసి

రక్కసిమూకలంబిలిచి రాక్షసకృత్యములాచరింప నీ
కెక్కడినుండివచ్చు నపకీర్తియుహెచ్చుట కెంతముప్పు నీ
వెక్కడ! యీదురూహవెర వెక్కడ! యాత్మదలంపనీపనుల్
పెక్కులు హేయమయ్యెడిని పేధలఁబెట్టకుమన్న రాక్షసా!

నీచాతినీచంబు నిజమతి దూరంబుఁగా
జీవహింసలసల్ప నేగితన్న!
దుష్కృతాచారంబు దుర్బుద్ధిమాంద్యంబు
నీతిబాహ్యమటంచు నిలుపుమన్న!
ఆత్మవత్సర్వభూతాదిఁ గావంగ నా
చారంబుమదిఁదలంచి యలరుమన్న!
సత్క్రియాచరణంబు సాధనహేతువై
ధర్మస్వరూపంబుఁ దాల్పుమన్న!

శ్లాఘ్యగుణజాల సంపద్విశాలగరిమ
గాంచుమార్గంబుఁజేరి సిద్ధిమ మొంది
వినుత సద్వర్తనాగణ్య విలకీర్తి
గనుటశ్రేయంబు రాక్షసాకరవరేణ్య!

మాంసభక్షణమున మాంద్యంబుగనుమీఱి
తామసాకృతిఁ జెంది దాంతియుడిగి
కండరంబులఁ బెంచి కాఠిన్యమదిపూని
మదపుటేనుగువోలె మాంద్యమొంది
కనుబ్రామి జెట్టియై కార్చిచ్చువలెమండి
యువయువబలమున నఱిగి మఱఁగి
భీకరాకారమై పెనుబందిలావునై
యాయాసవశమునై యాశలెసఁగి
మద్యపానాది మాంద్యంబు మఱఁగియుండి
విఱ్ఱవీగుచుఁ బందయై వెతలఁ బెట్టి
సానికొంపలఁ గూనలై చవటలగుచు
నూరుచుండుట సిగ్గుగాదో గయాళి

## చిత్తము

చిత్తము శాంతినొందు పరసేవితభక్తి విశేష నిష్కలా
యత్తమునొందె జీవితపు టాదృతివీడి నిజేచ్ఛఁ బోవుమీ
మత్తమధువ్రతంబు బలె మాంద్యమునొందితి తామసాకృతిం
గత్తరలాఁడ జొచ్చెనికఁ గాయమునమ్మకు! పొమ్ము! నీపరిన్
లోకమునమ్మినన్ జనము లోలమునైనరియించి భీతియై
వాకులవెఱ్ఱివోలెఁ బలు వాగుచు నీతివిడంగ హీనమై
చీకులఁ బొంది పొంది యిల ఛీయను సిగ్గిడి వేషధారివై
శ్రీకర భాసమాన పరసేవవిశేష మడంపనుంటివో!

జీవనమిందునుంట పయిసేవఁ జరించుట చోద్యమాట సం
భావితవేషధారణము భాసురజన్మ విడంబనంబుసం

జీవని జీవనంబు భవశేషవిదూరమ్మృతంబు డంబుల
న్నావరణంబుఁ గాఁజెలఁగ నాదృతియేలకో ! నీచజీవమా !

కాలముమారిపోయెఁ గలికాలమహత్తు వికాసమొందెఁగ
ల్లోలవితండ వాదముల లోకములెల్లఁ జెలంగె భామినీ
చాలనమానసంబులిల జారవిహారము కాశజెంద స
మ్మీలన వామనేత్రముల మేలిముసుంగుల గట్టులయ్యెడిన్

మనమున భావమొంది మడిమాన్యములొందఁగఁ గాసిఁజెందుచో
జనమనముల్ గలంచి వెతఁజాతురిఁ బెక్కునటించి పెంచినె
మ్మనములఁ జూపునట్టుల నమానుషకృత్యములాచరించి పో
వినఁగనలేని బెట్టిదము వేసముమార్చి చరింత్రు నీచకుల్

## సంసారి

సంసారసాగర సంసారమగ్నుఁడై
        యుక్కిరి బిక్కిరి నుసుకువిడుచు
దారపుత్రాదులదరిఁ జేర్పఁ గృషియించి
        బహుకష్టములకోర్చి పారముడుగు
బంధుమిత్రాదుల బడి తెపూజలగొంచు
        నపకీర్తిపాలౌచు నసువువిడుచు
లోకదృష్టులఁ జేరి లోలమనస్కుఁడై
        జనవాద మొనరింపఁ జావగోరు

మనసునమ్మిన మటుమాయమాయయంచు
బలుకు బంధులదూషింప బాధపెట్టు

నాప్తవర్గంబుఁ బాసిన నార్పుభవము
భవమునమ్మిన నిహలోక పాపియగును

రెండిచ్చియొకటొంది రేయింబవళ్లు సం
చార మొందింప సంసారియగును
మాటాడకుండిన మాయలాడియటంద్రు
మాటాడ సోదెగాఁ డౌటయగును
సాహాయ్య మొనరింప సంసారహారిగా
నాలోచనంబుల నాలియంద్రు
మనసిచ్చి ప్రేమింప మాయవాఁడనియంద్రు
ధనమిచ్చిపోషింప దాతయంద్రు

బంధువర్గ విశ్వాసంబు వదలిమనుట
దారపుత్రుల శ్రేయంబు ధన్యుఁడగుట
ఆప్తులంచు నమ్మించు నీ యాసగాండ్ర
వీడిపోయినఁ దనబాగు వెతలఁతప్పు

శ్రేయంబుఁ గోరుచు సిరిసంపదలనిచ్చి
సంసారి సల్పంగ సాఁకునంద్రు
సాఁకఁబోవంగ సంసారి సేడ్పించి యు
పోహలఁగలిగించి పొంకమూడ్చు
చూపోపుగనలేమి చుప్పనాతులవోలె
చూపోపుఁగనలేరు చుట్టలెపుడు
ధనవంతుఁడైనచో దారిఁజూడఁగలేరు
మాత్సర్యగ్రస్తులై మాడుచుంద్రు

వీరిజేరంగఁ బ్రార్థింప వెరవదేల?
కష్టకాలంబు దీర్పఁగఁ గలియరారు
మమతలల్లుచు బల్కుచు మాయదార్లు
కొంపఁగూల్పంగజూతురు కొల్లగొట్టి

చుట్టాలుగాన్పిపఁ జుట్టురట్టులఁజేరి
ప్రార్థించియింటికి రమ్మనవలె
వచ్చిమర్యాదల వరుస షడ్రుచులను
వడ్డించి ప్రేమతోఁ బరగవలయు
పరగి ధనంబింత దారిబత్తెముకియ్య
బందువనగ వీరు బంధువంద్రు
బెట్టులుపోవంగ బ్రీతిఁ బ్రార్థించి ని
వాసంబు గల్పింప బంధువంద్రు

గొంతెకోర్కెల జూడంగ గొంతుకార్పి
చంపివేయుట శ్రేయంబుసాఁకుగోరి
యెన్నిసల్పినగాని యీహీనజాతి
చెడ్డపేరుల కల్పించు "ఛీ" యటంచు

ఆప్తవర్గముఁజూచి యాదరంబునబిల్చి
యారగింపఁగఁజేసి యంపవలయు
బంధువర్గముబిల్చి పానకాలందిచ్చి
ధనమిచ్చి మెప్పించి తనుపవలయు
చుట్టపక్కము లేరి పట్టుబట్టలబెట్టి
ధన్యవాదముఁదెల్పి తనుపవలయు

చట్టంబుగల్పించి సంసారమర్మంబు
చుట్టకు వినిపించి సురుగవలయు

చుట్టములలేమి సంసార సుఖముగనుట
ప్రాణిసౌఖ్యకరంబు సంప్రాణియగును
చుట్టలనుచుట్టినన్ వెతఁజుట్టవలయు
బంధులేలకో! కొంపల పాడొనర్ప

# కొండపల్లి కొండ

## ప్రాభవము

పదునాల్గవశతాబ్ది ప్రాభవంబులఁగన్న
    అనవేమభుజ పీఠినలరితీవు
కృష్ణానదీతీర కీర్తితవన రాజ్య
    వైభవోపేతవై వఱలితీవు
పంద్రెండుమైళ్లను ప్రాకారవేష్టమై
    కందకాంకితకోట గలిగితీవు
సంతత ధారావిశాల గంభీర పూ
    రిత జలమయతచే రేగి తీవు

కందకంబుల నావలసందళించి
కొండకోటల చుట్టును మండిపడుచు
తిరిగి శౌర్యపరాక్రమ మరుదుగొల్ప
పౌరుష మెడలించితి కొండపల్లి కొండ

అనపోతవేమన్న నైశ్వర్యములఁ దూగి
    దండిగా సిరిగొన్న కొండపల్లి !
పెదకోమటన్నయా బెదవేమరెడ్డిచే
    కూర్మిఁగాంచినతల్లి కొండపల్లి
వీరవిద్యాధరు చేమనఁ బొల్పొందు
    నిండుచెఱువుగన్న కొండపల్లి

మూరు రాయరగండ మోదమొందినవల్లి
గండశిలలతల్లి కొండపల్లి

రాయలందఱువెల్లల రాపిడించి
పండుగా నిలబెట్టిన కొండపల్లి
ముత్తనామాత్యు మోదంబుపొంది నేడు
కండకరగి శుష్కించెదో ! కొండపల్లి !

తె లు గు దొ ర లు

రాజ వేమారెడ్డి రాజేంద్రుఁ గోమటి
వీర వేమారెడ్లు వెడలినారు.

రాచ వేమారెడ్డి లాంగూల గజపతి
దేవరాయలు నాడె తేజరిలిరి.

హరిహరరాయలు నాకపిళేశ్వర
గజపతిసింహులు క్రాలిరపుడు

బహామనీసుల్తాను మహామదుషాదులు
కొండకోటలబాగుఁ గోరిచనిరి

పురుషోత్తమేభేశ ఒరిసాంబరాయఁడు
మంగళరాయలు మరిగిరకట !

వీరభద్రేభేశ భీకరరాయలు
వెలిగించి శ్రమించి వెడలిరంత

ఒరిసావిరాజులు సలకులీకుతుబుషా
అచ్యుతరాయలు సరిగినారు

శ్రీసదాశివరాయ శ్రీవేంకటేశులు
నిబ్రహీమ్‌పాదుషా లేగినారు
ముత్తనామాత్యుండు మొదలైన రాజేంద్రు
లరిగర్వపౌరుషంబణచినారు
రాజశేఖరు లెచటనో తేజరిలుచు
దేశదారిద్ర్య నిష్కలా దీనదశల
జూచుచుందురుగాబోలు! చూడ్కినిలిపి
పాప్తియెప్పటికో! కొండపల్లికొండ

జౌన్నత్యము

తెనుఁగునాడుకు పేరుదెచ్చి మించినవాడు
శ్రీత్రిలింగంబుగ జెలఁగునాడు
కృష్ణానదీతీర కీర్ణితోత్తరభాగ
విజయవాడగ నాది వెలయునాడు
గోల్కొండసీమ నాఁగొన్న లింగమనాడు
ఖండము నాఁ పేరు గాంచునాడు
గిరి దుర్గముల నైదు బరగి రాష్ట్రము గాఁగ
దుర్గ చతురంగీతి దొరలునాడు
ముస్తఫా నగరను పేరు మ్రోగునాడు
మృత్తుజానగర మభేద మెంచునాడు
రాజ్య భోగ విలాసాలు రగులునాడు
ప్రౌఢ మెటులుండెనో! కొండపల్లికొండ

పదునొకండుశతాబ్ది ప్రౌఢవిశ్వంభర
శాతలీయుగ పేరుఁ గన్ననాడు

భూ నభోంతరములు పొందుగాంచినయట్లు
బుట్టకోటల ప్రౌఢి గట్టునాడు
పరుస వేదిఁబొంది పర్వతోన్నత దుర్గ
ప్రౌఢత కోటఁ బఱపునాడు
కొండకోటల నెన్నొ గోల్కొండ దర్వాజ
నిర్మించి ఘాటిగా నెగడునాడు

పల్లెదగ్గర కవులూరు పల్లెనందు
అన్నదమ్ముల నివసించు నార్యుఁడనఁగ
వేమరెడ్డి భూస్వామి వివేకివలన
ప్రౌఢ మొందిన యీ కొండపల్లికొండ !

ప్రత్యర్థి భీకర పౌరుష రెడ్డిరా
జేంద్రుల భుజపీఠి నెసఁగుకొండ
ఆంధ్రసామ్రాజ్య భోగైకమై ఫలప్రాప్తి
గజపతి మకుటాలఁ గదలుకొండ
ఒరిసా మహారాజ యోగ్య సంపాదిత
రాజ్యశాంతికి ప్రజారాజ్యమనగ
కర్ణాటకేశుల కంకణంబుల నిల్పి
యరుల పౌరుషముఁ జక్కాడుకొండ
హైందవ శౌర్యాగ్ని నార్పఁ జూడగనున్న
శ్రీ నవాబులఁబట్టి చెండుకొండ

బాహుబలముల శౌర్యాగ్ని పర్వనపుడు
పౌరుషోక్తుల నయనాగ్ని జారునపుడు

వీరవిక్రమ రణభూమి వెడలునప్పుడు
వరలుచుండెనో యీ కొండపల్లికొండ!

హైందవనామంబు లార్పఁజూపుడు రండు
ఉరుదు పేరుల నిల్ప నోర్వ నెట్టి
గజపతుల జయించి కారుణ్యమది లేక
కొండపల్లిఁగూల్చి కోటఁగట్టి
హైందవోద్యోగముల్ హరహరా యనిపించి
తత్పదవి నవాబులఁ దాల్మినిల్పి
దేవాలయంబుల దేవలోకులకిచ్చి
దర్గాల పేరిటఁ దనర గట్టి

ఆర్య సాంప్రదాయంబుల నణఁగద్రొక్క
మహమదీయ నైజంబుల మాటు వేసి
మార్పు జేసిన గుళ్ళకు మసీదు లనిరి
భళిర శ్రీ నవాబులు కొండపల్లికొండ.

సన్నివేశము

దుర్గాధినాయక దక్షితరక్షణ
కనుకూలముగదారి యనువుగలిగి
రాచబాటలుమఱి రాళ్ళబాటలుగల్గి
రాధారిగుప్తమార్గములు గలిగి
ప్రాకారములపైన బదునైన బుఱుజులు
బుఱుజులపైసేన ప్రోదిగలిగి

ఆకాశమునునంటి ప్రాకార వైభవ
పర్వత నిర్మిత ప్రాప్తిగలిగి

మధ్యమధ్యల కొండలే మాటుగలిగి
పెట్టినట్టులె ప్రాకార వేష్టములుఁగ
సహజ గాంభీర్యమౌన్నత్య మహిమగల్గి
పరగుఁగోటలతోఁ గొండపల్లె కొండ

ప్రాకారపంక్తిలోఁ బరగుఁ గట్టడములు
సౌధరాజంబుల చక్కదనము
ప్రాచీనశిల్ప సభ్యతఁగాఁగ సౌభాగ్య
నిర్మాణనైపుణ్య నీతిగలుగ
కోశాధికారుల కోర్కెలపై ధనా
గారరక్షణసేన కాపుగలిగి
తన్నివాసంబుకై తన్మధ్యసౌధరా
జంబులమధ్యను సైన్యనాయ
కాదులసౌధముల్, వాడుగ రాజస
భాంతఃపురోద్యాన హారివనము
రాజవీధులుగల్గి రాజదర్బారు సౌ
ధాగ్ర శిలావిగ్రహములు లతలు
ప్రాచీనవైభవ ప్రాప్తిగాఁగా శిల్ప
కారులనైపుణ్య కళలఁ దేటి

క్రిందిభాగాన గజశాలలందములుఁగ
అశ్వశాలా భయంకరమడలు గొలుప

శత్రునిర్భేద్య కాఠిన్యసాంద్రమహిమ
బఱగు గంభీరమై కొండపల్లి కొండ,

దుర్గమార్గంబునఁ దూర్పుభాగంబున
ద్వారసేనాధ్యక్ష భవనముండు
అందు బురుజుపైన నాహితసైనికుల్
కవచధారులు దారిఁగాయుచుంద్రు
దీని నెక్కిన కృష్ణ, తీయఁగా నైజాము
బాటలు గన్పించు బారుగలిగి
దుర్గదక్షిణమునఁ దోనెబ్బ బురుజుపై
అమరావతీదృశ్య మందుకొనును
గిరిరహస్యములెల్ల లుఁగాంచఁగనొంటి
మన్యపు బుఱుజులో మర్మమెఱుఁగు
బుఱుజుపైఁజూచిన ముఖ్యబృందావన
సాగరతీరపు జాలుదెలియు
కొండవీటిని గాంచఁ గొల్లఁగొట్టఁగ శత్రు
సైన్యంబుల వలీల జాలుదెలుపు
ఒంటిమన్యముపైన నొకసేవకుండుండి
శత క్రోశ ప్రత్యర్థిసైన్య మెఱుఁగు
శత క్రోశసైన్యంబుఁ జక్కాడ రణభేరి
మ్రోయించి యందరి మునువుగొలుపు
తక్కటి బుఱుజుల దండధరులెఱింగి
సిద్ధపఱతురు లోసేనలన్ని
రాజవీధుల వెన్కరాణి వాసులకెల్ల
కానమాడఁగఁదటా కానసనువు

చెఱువులో నావలు జెలఁగవిహారంబు
సలుపయోగ్యంబుగ వలనుగలుగు
భవనబహిర్భాగభాగ్య ధేయములట్లు
చెలికత్తియల తాన చెలిమిఁదెలుపు
సరసుల జలకేళి వరసల విహరింప
పూగుత్తియందంబు, పొలుపుదెలుపు

రాచకన్నెలు తిరుగాడ రాణ్మయంబు
తరులతా యుగ్మసుకుమార దాంతిఁదెలుపు
తనరు పూదోఁట యొక్కటి తమవిహార
భాగ్యమో! స్వేచ్ఛయో! కొండపల్లి కొండ.

## అనుభూతి

వీరభద్రేభేశ విఖ్యాతభుజకీర్తి
ద్రిపురంబులే తెల్పుఁ దిరముగాగ
పురుషోత్తమేభేశ భూమీశశౌర్యాగ్ని
ద్రిపురంబులే తెల్పుఁ దీవ్రపటిమ
మహామదుషాభక్తి మార్పులకోటల
గోడలబాగులు కోటిసేయు
వ్యవసాయములప్రాప్తి నవపద్ధతులఁజూపి
సస్యభరితభూమి సాగుజేయు
రాయలసామ్యగా రాజ్య ప్రజారంజ
కంబుఁగఁజేయ వికాస ప్రతిభ

పరరాజ రాజ్యంబు, బటురయంబునఁజీల్చి
స్వాధీనముగఁ జేయ సాకుఁగనఁగ
రాయల భుజపీఠి రంజకత్వముగొన్న
రాజ్యరమామాత రాణిగాఁగ
విజయనగరములో వేంచేసి సరిఁజేసి
వైభవంబులగన్న పల్లెరాణి
భేదమించుక లేక గాంభీర్యమెసఁగ
లలిత తరులతా యుగ్మసంలాప
నూత్నపరిమళ వాతాంకు రాత్మయగుచు
పఱగు రాజ్యలక్ష్మి! కొండపల్లి కొండ.

ఆంధ్రపౌరుషమెంచి యరివర్గమెడలించి
కర్ణాట కాంధ్రసంకాశమెంచి
ఆంధ్రశౌర్య పరాక్రమాఖిల ప్రత్యర్థి
భుజబల మెడలింపఁబోరునెంచి
క్షాత్రతేజంబునాఁ గపటమతులనెంచి
చెండాడి కుత్తుకల్ చీల్చుటెంచి
నూతన యౌవననూత్న శౌర్యాగ్నిని
పరవీరగర్వ సంపదలనార్పి
ఆంధ్రరాజ్య రమాభర్త యార్యపటిమ
యుద్ధభూమిని నృత్యసంయోగమెంచి
కృష్ణరాయల భుజకీర్తి ఘీంకరించి
పటమునుగనెనో కొండపల్లి కొండ

ఆంధ్రరాజన్యుని నైశ్వర్యమొందిన
భాగ్యవంతమ! కొండపల్లె కొండ!

కువలయేశ్వరుఁజేర కోర్కెలన్నిటిదీర్ప
పటుతేజమునవెల్గు పట్టుకొండ

శత్రురాజులనెల్లఁ జక్కడిసింహాసన
నారూఢిగాంచిన తేరుకొండ

విజయనగరరాజ భుజపీఠి వెల్గొందు
భాగ్యమొందిన కొండపల్లి కొండ

అష్టదిగ్గజకవు లాశీస్సులందింప
భవ్యమొందిన కొండపల్లె కొండ

కవిసార్వభౌమాది కావ్యగీతంబుల
పల్లవించిన కొండపల్లి కొండ

భూసార్వభౌమ నిర్వ్యాధ భుజవిలాస
మల్లిపూచిన కొండపల్లి కొండ

కోకిలాకలరావ గురుగీతములచేత
స్వాగతమో! కొండపల్లి కొండ

ఆంధ్రరాజ్య రమామాత యాదరించి
పుత్రప్రేమనునిల్పి నీపొత్తునుండ
కృష్ణరాయల భుజపీఠిఁ గీర్తినొంది
ఆంధ్రరాజ్య రమాభర్త యరిగిరాఁగ
కృష్ణరాయల హృదయంబు కీలుఁగాఁగ
వాసిఁదీసుక నీపరి వాసమొంద
వచ్చియుండెగదా! కొండపల్లి కొండ!

తిమ్మరుసు - ప్రతిభ

నాదెండ్ల తిమ్మర్సు నాల్గుమూలలఁగాంచి
రామదేవుని గెల్చి రాజ్యమూని
మంత్రాంగములఁబన్ని మాయలన్ని టిఁజీల్చి
శ్రీనవాబులఁగూడఁ జేఁదీసి
రాజ్యతంత్రంబుల రామణీయకముగ
సంధిపత్రంబుల సాఁకుజరిపి
విక్రమభుజబల వీరశౌర్యదవాగ్ని
పరవీర సైన్యంబుఁ బారద్రోలి
శ్రీనవాబులతోడ స్నేహబంధములల్లి
ఎవరిపంతంబుల నెఱుఁగనీక
ఇబ్రహీమ్‌పురినుండి యీశుఁగృష్ణునిడించి
ఎత్తుబురుజుపై మహీశునుంచి
తంత్రమంత్రముగాఁగఁ ద్రవ్వించి భావిని
నైజాముజోహారు నైజమెంచ
బావిలో జోహారు భావించి రాయలు
మున్ముందు జోహారుమురుపుగొలుప
సంతసంబునఁ బాదుషా స్నేహమొప్పంగఁ
దిరుగ సలామును దీటుగొలుప
రాజన్యులిద్దరు రాచకాగితముపై
సంధిపత్రముపైన సంతకాలు
సంతరింపఁగ మంత్రచాకచక్యముతోడ
సంధిపత్రముఁదీసి చక్కఁజేసి

తుములయుద్ధంబును దునుమాడిచేఁదోడు
వాదోడుగానుండ వనరుఁజూపి
రాయలకోటను బ్రాకారములఁజూపి
యద్భుతానంద జలాబ్ధిమునిగి
కోటఁబ్రవేశించి కొల్వుకూటములోన
సభఁదీర్చి నైజాముసాగనంపి
బుఱుజులన్నింటను బురుషవీరులనుంచి
ప్రతినిధి నొకనినిఁ బ్రజ్ఞనిలిపి
చైత్రయాత్రకుఁ బంపఁజైయటంచును రాజు
ప్రజలు సంతోషానఁ బలుకుచుండ
శ్రీకృష్ణదేవుఁడు శ్రీరాయలరుగంగ
జయగీతముల్గొల్వ జయముతోడ

శత్రురాజులు కంపించి సౌఖ్యమంది
విజయగీతలఁబాడించి వినయదాంతి
శాంతిమూర్తిగనుండు నాసచివుఁడనఁగ
తిమ్మరుసు మంత్రి భావినిఁ దిరముగొలిపి
మంత్రితిమ్మరుస్సు నిద్ధన్యు మాన్యుఁజేయు
పట్టుఁ బట్టెచుబో కొండపల్లి కొండ !

# వి ఘ్నే శ్వ ర

కరిముఖ ! నాదుజన్మము వికావికమై కుదురంబులేమి ని
బ్బరమిడి పిచ్చిపోలెనయు పాకము తప్పుచు నున్నదయ్యా ! నీ
వరసుకుమార భద్రసుకృపాతతిఁ బర్వి మదీయ జన్మమున్
సరసకవిత్వ లుంతితను షాఘటిఁ జేయుము విఘ్ననాయకా !

ధనపతిమిత్రపుత్ర ! ప్రమథప్రముఖావళి నేర్చికూర్చి నీ
వినయములంతరాయముల వేగిరఁబెట్టుచు నున్నవయ్యా స
జ్జనతతి నంతరాయముల జాఱగనీయవు నీమహాత్వముల్
వినఁగన శక్యమయ్యె ! ఘనవిఘ్నపతీ ! మముగావుమైశ్వరా !

కలకలలాడు దివ్యవరగానము నెచ్చటఁ జూడలేదు నీ
పలుకుల యాశనొంది యుట పాటలదీక్షగఁ బాడుచుంటి నీ
పలపలనుండు విఘ్నములఁ బాఱగఁద్రోలుము విఘ్నరాజ ! నీ
కలదరహాసభాసములఁ గాంచఁగరాదె ! కటాక్షలీలలన్

ఎన్నియొ యుండరాళ్లను మదీయ ప్రియాంగన నీకొసంగఁగా
కన్నెతనంబులోన నిజకాంతుని జేరి మదీయభావి సం
పన్నవిపక్వ కార్యపరిపాకము నొందఁగ సిద్ధపర్చె నీ
విన్నియునారగించి పొరుగింటికి నేఁగక బొజ్జనింపి నీ

కన్నయనుంగుఁదల్లికిని గాంచెడుదండ్రికి మమ్ముఁజూపి మా
యన్నరొ ! యంతరాయముల నంటగఁ నీయక కార్యసిద్ధులన్
వన్నియ లారఁజేసి వరభావములొందఁగఁ బూను మైశ్వరా !

లోకులనంత సంతసములొలతఁ దత్పరతా సపర్యలం
గాకలనూని భక్తిమెయిఁ గారవమొందక సర్వకార్యముల్
ఏకము లై వెలుంగ వరదేశ్వరుఁ డైన భవాని పుత్రుని
న్నాకులపాటు లేమి హృదయాధిక ! వేడె శుభంబు లొందఁగా

నేరెడు పత్రిముల్ దొరక నేరక మారెడుజమ్మి పత్రముల్
గారవమొప్ప చెంగలువ గడ్డిని గన్నరుటాకులన్ విని
స్సారమనంబులోఁ గలయఁ జాగిలిజేయుగ బుద్ధిహీనత
న్నారయ నుండ రాళ్లగమి నందఁగ లేకను నుంటి నైశ్వరా !

కాని యపూర్వపుణ్యాచుల సకాలమునాటికి నీదునామముల్
మానసమందునుంచి నినుమాన్యత జోతినిఁ జేరివాంఛలన్
దీనత వేడుకొంటినిను ధీవర ! నామనిలో వికావికల్
ఆన నొనర్చుచుంటి నిను నారయహృద్గతి గట్టి నై చితికి

ప్రమథ నాయక ! సర్వ కార్యంబులందు
విఘ్న రాహిత్యశబ్ద వివేక కాంక్ష
సంతరాయాంతకా ! దరహాస మొలుక
విఘ్నముల నెల్ల బాపుము విఘ్నరాజ ! 15-10-29

స ర స మ తి

సుముఖా ! వందనమందుకొమ్ము సుముఖా ! శోభాయమానం
బులై
విమలావాస వసంత శేహాత సజీవింజేరి సౌఖ్యంబులా
సమభావంబుల నాతితేజగ మదీశా ! శైవ ! సర్వేశ్వరా !
వినుతాశన్ వికటంబుజేయుగదవే ! విఘ్నేశ ! విఘ్నాంతకా !

హృదయమందలి భావంబు నెన్నదరమె!
ఎట్టిపుట్టను నేపాము పట్టియుంనె?
తెలియశక్యంబ! మానవ తేజమిను
నవగతంబగు బ్రహ్మకు నరసి తెలియ

జీవితంబంతఁ బూజల జేసితనదు
కోర్కెలీడేరు ననుచుండు కోవిదాళి
భగ్నహృదయులై జీవిత బాధలొంది
దిక్కుదెలియంగ లేరిలఁ దెలివిమాలి

భక్త హృదయంబు దెలియంగ భవునికైన
విడచి కార్యపుసిద్ధికై వేదవిధుల
నాశ్రయించి మనోరథ మందువరకు
జపము సలుపుదు రీరీతి సరసమతులు

స్త్రీలసేవించు నాతండు చెనఁటియగుట
కొండనెక్కించు వాఁడిల కుక్కయగును
రాళ్లబూజించువాఁడిల రక్కసుండు
దేవపూజలజేసిన దివ్యుఁడగును

బుద్ధిమటుమాయ హృదయంబు బుగ్గియయ్యె
మనసుచపలత నొందెనామాయనెంచి
వికృత ప్రకృతియై జీవిత వేదనొంది
పలువితాపులఁ జెందు నీపాడుమనసు

భావనిగూఢ హాంత ప్రతిభావిధి భవ్యసుబోధ మానసా!
నావిమలాంతరంగ భవనస్థ! మదర్చ్య పదైకదంతుఁడా!

నీవరపాదపంకజమునీపయు నామనసముందు నేయెడన్
కావగరాగదే ! భువనకార్యసమర్థక ! దంతిరాణ్ముఖా !

లోకములెల్లఁ గొల్చినిను లోకువఁ జేసి మనోరథార్థముల్
నీకరుణాకటాక్షలవ నిర్మలచిత్తయశస్కులై పృథ్వి
స్థాకలితార్థవాద కపిలా ! వెస సంపదవృద్ధి జేయుమా !
యాకలినొందుబీదల ముదావృతిచేఁ గపిలా, భరింపుమా !

కావుమటంచు ! నిన్ను గజకర్ణక ! నావరమిమ్మటంచు నా
భావమునం దలంచి పర భావము లెంచక నీదు నామము
న్నా విమలాంతరంగసదనంబుననిల్పి విశేషభక్తిమై
నీవరపాదపద్మముల నిశ్చలతన్ వెసఁ బూజఁ జేయుదున్

ఓలంబోదర ! నిన్ను గొల్చెద మహాప్రోత్సాహసంపత్ప్రదా !
ఆలంబందున నిల్చి దోసముల నీయాహార పానంబులున్
శీలంబున్ సరిగాంచి భక్తతతి త్వత్సేవల్ మదిన్ భావనా
హేలాభావము జూపిమమ్మగణ మాహేశా ! కృపం గావవే ?

వికటా ! నిన్మది నమ్మియుంటి భవ ! మా వేధల్ పడిన్ మాన్పవే
అకలంకంబున వేడుచుంటి వరదేశా ! మమ్ము గాపాడవే ?
సకలార్థంబుల సర్వకాంక్షలు మహేశా, యిచ్చి చూడంగదే !
సుకలాభావకవిత్వ తత్వగరిమన్ సొంపెద్దు నిప్పింపవే ?

భవపుత్రా ! భవదీయపావనపదం బాపాత్మ రక్షింపవే !
నివసంబిచ్చి కృపాకటాక్షలవ సిద్ధిప్రదాధన్య సత్యాత్మకన్

విపదాధ్వర్య మహోన్నతాశంను భావింపంగటాక్షింపదే
నవనాధ్వర్యుంగజేసి కావగదె యీశా ! విఘ్నరాజాధిపా

సకలకార్య సంసిద్ధి నీ సదయమతిని
నొంద గనియుంటి నీ పాదములందుసలిచి
నీవె దిక్కని నమ్మితి నియతివనుచు
నమ్మియుంటినిగా నీశ ! నాగవదన !

కోరికలొసంగ నిలిచితి
హారతి గొనుమయ్య దేవ తార్చితచరణా !
ధీరుడవైననుగావంగ
రారా ! నాబ్జతండ్రి ! రక్షింపమదిన్

నీదాస దాసదాసుడ !
నీదయనొందంగనుంటి నీ దాసుండన్
నీదగు కృపాకటాక్షము
నాదరిం బ్రసరింపజేయు నాగేంద్రాస్యా !

నీసేవయని నమ్మి నిత్యంబుం బూజింప
నీదారిఁజూపంగ నీల్గితయ్యా !
పాదాబ్జభజనంబు బాటించి నిన్ ధ్యాన
ముగ్నుండనైనల్ప మాగితయ్యా !
నిర్మలభావంబు నిత్యసంధానకం
బలరార నీమూర్తి నాపితయ్యా
బొజ్జనింపంగ నీబుత్తిజూడంగనీ
దరిజేరగా నెట్లొ దాగితయ్యా !

పాపకర్మపుగాదు గాఢ భక్తపరుని
దోషమెంచిన నాయంబె! దురితహార!
వందనంబిదె! గొనుమయ్య! వంద్యచరిత!
దురితమెడలింపు శ్రీశైవ! ధూమకేతు!

కరివదనా! మదీయఫల కాంక్షఁ దెల్పితి యోగమందితిన్
అరిగితి భోగభాగ్య ఫలహారము యాచన సేవఁ జేసితిన్
పరధన మాశలేమిని సహాయధనంబుల నిమ్మటంటి నీ
వరపద పద్మయుగ్మమును వందనసేవలఁ బూజజేయుదున్

నీతినియామకంబు నతినిమ్నల భావవిశేషణంబు సం
వీతన చారణంబు ధనవేదన దూషణభూషణంబు నా
కాతర భావనాశనము కార్యవిహారత సిద్ధిబోధనల్
ఆతత కావ్యలాలితము నాహితు జేయుము వక్రతుండుఁడా

దేవా! మహిమలఁ గొనఁగా
గావా! పాపాంతకుండ! కాపాడుమయా!
రావా! వరముల నియ్యఁగ!
బ్రోవన్ ఫలసిద్ధినొసఁగి భువనైకవరా!

ధనపతిమిత్రసుపుత్రా!
"ధనమూల మిదమ్ జగత్తు దనరన్ వినవే
కనవినఁ గష్టము గణపతి
ననుదయతో బ్రోచిఘనధనాఢ్యునిఁ గనవే?

పరభావంబున వరదుని గొలుతున్
[illegible]

వరములనన్నిటి వర్ధిలగాంతున్
వరదాయకు మది వందితుఁదలతున్

జీవన మిమ్మిన జీవినిగానా !
కావరమణఁగిన కాంతుఁడగానా !
నీవెయ్యనంగా నీపదమానా !
కావరవేగమి ! కరివదనేశా !

హేరంబేశుఁడ ! ప్రార్థనంబువినగా నిష్టంబు దెల్పంగదే !
ఆరామాభిహృదబ్జవాసకరుణ న్నాధ్యాత్మ్మరక్షింపవే !
పారంబౌ భవసాగరానఁ దరిగాసాధింప దాటింపవే !
భారాకృష్టుఁడనై తరింపగలనా ! భావార్థసంధాయకా ?

వరుసగ జేసితిన్ భవజ ! పాప విదూరక ! ప్రేమజాతి నీ
దరినవరాత్రముల్ సలిపి దైవము, నిన్నువరించి కొల్వఁగా
గరుణ యొకింత లేదు నుడి కల్లగఁజేసితి వెట్లొకో, గతుల్
వరభవపుత్ర, జూతువెటొ, వందనమింతియ నాదు భక్తితో

శివశివమూర్తిని సేవింతుమదిన్
భవహరమూర్తిని భజయింతుమదిన్
శివభవమూర్తిని జేర్తును హృదిసిన్
శివతారకమును జీర్ణింతుమదిన్

శివభవ తనయుని సేవలగొనుచు
భావమందు నభవుభావనజేసి
ఆపదబాపర, అభవేశపుత్ర
పాపముల్ ద్రోలుము భవపుత్ర మిత్ర !

దేవా! భావమునిండలంచి పతిగాఁ దీవ్ర వ్రతాభాసమై
భావాతీతుని భక్తపోషణునినిర్వా భావించి నీవాఁడనై
ఆవాసంబుగఁ బాదపద్మముల సాయంబున్ గటాక్షింపవే !
ఓవాణీ పదభాసమానకలనా, యోస్కంధ పూర్వోద్భవా !

కరివదనా, భవానందన, యగాధరసాంచిత గాధ మాధురీ
భరితమహత్వసాధు జనభావసమంచిత కార్యదక్షకా ?
చరితమహానుభావ, పదపద్మవిలీన వశంవదాత్మ సం
చరితవిశాలభావ వరసంచిత పూజభరింపుమీశ్వరా ?

శోభచెలంగ నీదువర షోడశ నామ జపంబు జేయునా
వైభవసంపదల్ యొసంగి వైశ్వభవానందన , వేదచోదితా
శాభవితవ్యముల్ గలుగ శాసనమొప్పనొసంగి విఘ్ననా
థా ! భవపూజ్యమిమ్ము వరదా ! పదపద్మజపంబు నిల్పుమా ?

శ్రీలజెలంగి భావవర రీతిఁద్వదీయ జపంబుఁ జేయఁగా
నేలకొ ? నా మొరల్ వినియునించుక వత్సలభావమూనవో ?
కాలవిపర్యయంబొ ! కలికాలమహాత్మ్యమొ ? తెల్పు శంకరా
లీలగ నీపదంబుల విలీనమొ షోడశనామముల్ మదిన్

సౌముఖ ! దంతైక ! సంధానకపిల !
ధూమకేతు ! సువక్రతుండ ! హేరంబ!
స్కంధ పూర్వజ ! శూర్పకర్ణ ! విఘ్నేశ !
బంధ ! లంబోదర ! ఫాలచంద్రవర !

గజకర్ణ ! గణనాథకా ! గణాధ్యక్ష
గజవదన ! వికట ! కవితాప్రతీక్ష !

నీదాసదాసుండ నిత్యైకశుభద !
నీదానగ్రహణుండ ! నిరతాన్న దాత !

భావైక వేద్యంబు భావనారూప !
కావరావేమిరా ? గణనాధ భూప !
పార్వతీ పుత్రకా ! పతిరాజచంద్ర !
సర్వేశ్వరా ! విశ్వ సర్వేశ్వరేంద్ర !
గిరిరాజ జాత్మజా ! గిరిశహృచ్చంద్ర !
వరవిఘ్న హారకా ! వరదాయి సాంద్ర !

నీనామజపతప నిత్యైకమంచు
నానతి గైకొంటి నైశ్వర్యమంచు
సిరిసంపదలనిచ్చి చిరకాలమీవు
వరసిద్ధి నొసరించి వరలంగ(గా)వు !

శంకర తనయా ! నాపయి
శంకల విడనాడి విఘ్నసంహారుండవై
పంకజభరణా ! వంశపు
సుంకులు దీప్పంగవలయు సుందరవదనా !

బొజ్జలతండ్రీ ! నిన్మది
నొజ్జగ జేకొంటి నార్య ! యుండ్రాళ్లను నీ
బొజ్జనసింపి మనంబను
సెజ్జపరుండంగనిత్తు సిద్ధగణేశా !

నీపదాంబుజ ధ్యానంబు నిర్మలంబు
[illegible]

భక్తితతికల్పితనువంచు భావమూను
మూర్తిభావంబువరలుమా ! ముక్తిదాత !

ప్రేమవిహార ! యోపరమవేదవిహార ! భవాంతకా ! జగ
న్నామము లంద్వదీయబహు నామజపంబు పదాంబుజంబులన్
కామితజాతిభేదమును గాల్పగ మానవభేదమిల్లగా
నీమహిమంబు గొల్తుమది నిత్యగణాధిప ! యోవినాయకా !

సుఖముభాగ్యభోగ్యంబులు శుభములొంద
దీవెనలనియ్య సంప్రీతి తేజరిల్లు
భవభవానసుడ, గణనాథ ! భద్రవదన !
వందనంబిడె, గొనుమయ్య భవ్యశైవ !

దేవా ! మహిమల గొనంగా
గావా ? పాపాంతకుండ కాపాడుమయా !
రావా ! వరముల నియ్యంగ
బ్రోవన్, ఫలసిద్ధినొసంగి భువనైకవరా !

నీతినియమంబు విడిచినం
జాతిమతయమలోకబాధం బడయువలయునే !
శాతర మొందుచునుందురు
ఆతత జారాదులందు నలయుదురెపుడున్

భాగ్యాత్త వశుడనై నీ
వాగ్యమనియమంబుదాల్చి వరలుదునైవా !
భాగ్యధనంబులగొసి నీ
వాగ్యమనియమమున భాగ్యవంతునిగనవే ?

మాటలఁ బలుకఁగనిచ్చును
కోటలఁ దాటంగఁ జెప్పఁ గోటులఁ గలరే !
నీటుగఁ బల్కుదురెల్లరు
వాట్టుఁగఁ దప్పించుకొంద్రు భవపుత్రనరా !

సలుపురు వినగా నల్వోన్నతింతున్
పలువితములమదిఁ భజియింతు మదిన్
కలరూపు వెసఁ గాంచక నిలుచున్
వల పెరిగించుచు వర్థిలభువినిన్

నరనారాయణ నామము దలతున్
వరదాయకమణి వాంఛింతు వెసన్
భరమడుగంటన్ భావింతు వరున్
పరమును నొందగ బ్రార్థింతు హరిన్

గిరులను హరులను గీడ్పడగింతున్
గిరిశుని హరినిన్ గీర్తింతు మదిన్
వరధామంబుల వంచలనిలువన్
వసుని గుణౌఘము వాకొందునిలన్

పాపకర్మవు గాదుగా భక్తవసుని
దోషమెంచఁగ న్యాయంబె ! దురితహర !
పంపసంబిదె ! గానుమమ్య్యా ! వంద్యచరిత
దురిత మెడలింపు శ్రీశైవ ధూమకేతు !

నీదరిజేరఁగ నియమతియె పతియా
నేదయజూతువో ! యీశ్వర తనయా !

శ్రీదయసంపదఁ జెలఁగం గృపయా
నీదాతృత్వము నిల్పుసహృదయా !

భావముదెలియఁగఁ బలికితి వరునిన్
భావనదెలియఁగ పాపాంతకునిన్
హావవిలాసము లారతిగొనినన్
ఓవిఘ్నేశ్వర ! యూహాలోసంగదె ?

గజవదనున్ మదిందలఁచి కార్యసమర్థత నర్థసిద్ధికై
నిజకరయుగ్మ పంకజవినిర్గత-శ్రీపద మొప్పఁ గొల్వఁగా
భజన నిజోన్ముఖుండయి యపారధనాహిత భోగభాగ్యముల్
సుజనవరుండొసంగె సురసూరమనశ్చర ఫాలచంద్రుఁడా !

నీతినియామకంబు నతి నిర్మలభావ విశేషణంబు సం
పీతన చారణంబు భవవేదన దూషణ భూషణంబు నా
కాతరభావనాశనము కార్యవిశారతసిద్ధిబోధనల్
ఆతత కార్యలాలితము నాహితుజేయుము వక్రతుండుఁడా !

మంగళము విఘ్నహరునకు మంగళంబు
మంగళము భవహరునకు మంగళంబు
జయముగజవదనేశుకు జయముజయము
జయ మభీష్టార్థదాయికి జయముజయము

# శారదాంబ

11—10—1931

శారద ! నీ యుదంచితవిశాలకృపావళిఁ బర్వి మత్కృతా
పారసపర్యలందుకొని పామరజన్ముఁడనైన నన్ను నిం
పారఁగ నీదుభక్తవరుఁ బ్రాజ్ఞునిజేయుము నాదుజీవితం
బారయ నీయధీనమొఁగ హావవిభాసిత శారదాసతీ !

పలుకులఁగుల్కుఁ ద్వన్మధుర భావపుసొంపు కళావిశేషముల్
కలకలలాడు వాఙ్మధు వికాసముఁగొల్పు రసప్రవాహముల్
పలుమరునేరు గ్రోలెదరొ వారెరసజ్ఞులు చూడమేదినిన్
కలికి ! భవత్కృపామృతమె గానమొనర్తు రనేక భంగులన్

కీరము లేమినోచెనొ ! వికీర్ణసుధామధు వాగ్విలాస సం
స్ఫార ప్రశస్యమాన మధుజాలమునన్ జగదాలవాలమై
గారవమొప్పగా జిగినిగారముఁ జెందెడి మానవాళి ప
ల్మారు తపంబుజేసినవిలాసిని ! నీదరిజేర లేరుగా !

ఒకనికి శుద్ధపదోన్నతి వేఱొక
        నికనంతగానంబునిముడఁనిచ్చు
నొకనికి భావంబు నొప్పారఁజిలికె వే
        ఱొకనికి స్వరలయ లొందఁజిలుకు
నొకనిని వ్యంగ్యభావోన్నతుఁజేసి వే
        ఱొకని నాట్యంబున నూగఁజూచు
నొకని కానందవార్ధ్యున్నతి నొసఁగి వే
        ఱొకని బ్రహ్మానంద మొందఁజేయు

నసమసాహిత్యసంగీతరసచుుల నెడు
గుబ్బపాలిండ్ల ధరియించి కోవిదాళి
గరుణఁ గాంచుచు గాపాడు కల్పవల్లి!
విద్దెలమ్మరో! కరుణింపు వినయమతుల

పలుకులకొల్కి! నాహృదయ పంకజమున్ విడిదింటిలోన నిం
పలరఁగ నింతదాక హృదయాంగమవౌచుఁ జరించియింతలో
నలువపడంతిఁ యేగితెటొఁ నాకనుబాసిమి చరించెదమ్మ! యీ
యలకులదోయిలింగొని దయామతిఁ బ్రోవుము బ్రహ్మవాక్చరీ!

భారతీ! నీదునామసంపర్కమహిమ
దురితభావములెన్నియో దూరమయ్యె
నీదుభక్త సంరక్షణ నీదిగాదె?
సరసనద్గుణ నికురంబ శారదాంబ!

సరస్వతి

తల్లి సరస్వతీ మిగులఁదాలిమిదాల్చి యనుంగుఁబుత్రు సం
ఫుల్లసితాబ్జనేత్రు ధరఁ బూరితభావవిలాసగాత్రు సం
వేల్లిత కావ్యగానరసవేత్త భవత్పదపద్మ పాత్రు యు
ష్మల్లలితాబ్జపాణి నిడి సారవిలాసుని జేయు భారతీ!

భాగ్యము లెన్నియున్న సిరిఁబారముగా గడియించి యుండినన్
యోగ్యకులీనతంబడసియున్న సురూప సుభాగ్య సంపదల్
యోగ్యములైన దానజనితో రుగుణంబులఁ గూర్చియున్న నీ
వాగ్యతనార్థికిన్ నరుఁడు వారిజనేత్ర, సముఁడు గాఁడిలన్

బీదలపాదలన్ వైదకి బీరమడంగి విలాససౌష్ఠవం
బాదరభావముల్ విడిచి యాతత దీనతఁగుందుఁ బ్రాణులన్
నీదరిఁ జేరఁదీసి కరుణించి సువాగమృతంపు సోనలన్
కౌదలనల్లఁజల్కి యసమాచితి భావములొందఁజేయవే ?

దమయంతి 28-4-1930

హంసరాజమ , నిక్కంబు నందఁజేసి
మానసదవాగ్నిఁ బోఁగొట్టి మదన బాణ
తాడితాహిత సంతాపపీడనూడఁ
జేసి పుణ్యంబుగట్టుకో, శిశిరవాణి

మదనదూషణ

ఇంతజగంబులోన నీక నెవ్వరులేరనియెంచి నామనం
బింతగఁజుల్కసేతె నినునిప్పుడె మానస మందుగంటి నీ
వెంతటిమొట్టు వెట్టినను నెంచకలోజరరాగ్నికిన్ వెసన్
కంతునిశబ్దమున్ మొదలగాల్పఁగ నాహుతిఁగా నొనర్చెదన్.

దేవతలందరుం బిలిచి దీనత వేడుచు విన్నవింపనో
దేవర, చిత్తమంచు రతిదేవి వసంతుని గూడియేగనా
పావనమూర్తి చూడఁగర పాదములన్నియుఁ దూలవీడచే
దాపక పుష్పబాణములఁ దాఁకఁగ నెట్టులఁజేతొ చూచెదన్

ఈమూలమునగాదె, యీశ్వరుండప్పుడు
ఫాలాగ్నిచే నేలపాలుచేసె ?

నీమూలమునగాదె ! నీయనంగతఁజూచి
    పరిహాసకేళినిఁ బల్కుచుండె
నీమూలమునఁ గాదె ! కాముకగోష్ఠుల
    బాష్పలేశంబైనఁ బాఱదయ్యె
నీమూలమునఁ గాదె దివిజులడ్డంబైన
    నేలికదేవేరి నెడముజేసె

నిన్ని చేసినఁగాని నీకించుకైన
మదిభయం బెద్దియునులేమి మగడ విరహా
కాముకులఁబట్టి చెండుట ఖలుఁడ, తగునె
షండ, భూతమ, ప్రజపాలి దండధరుఁడ !

ఇప్పుడు పేక్షచేసినను నిందునిసాయముఁ జేసికొంచునా
కప్పును బోవఁద్రోఁచి నిను కంతుఁడ , చెండును జేధరించి నీ
కొప్పునుబట్టి చెండెదను గుట్టు బయల్పడలంగ జేయనా
తప్పులసైంచుమంచునినుఁదారుదునే యిఁకపాపనీచుడా !

అప్పటిదాక నుండెదన ? యంచును బల్కెదవేని యిప్పుడే
కప్పుర పూవుటుమ్మలను గన్నులముందరఁ బెట్టి నామనం
బొప్పుఁగ జేసికొందు శశి ముందర బెట్టెద వాని కావలా
చొప్పున సంచరించి యిఁక చూతశిలీముఖజాలపుంఖముల్
చొప్పుఁగ కాముకీముఖుల జోలికిఁ బోకుము సిబ్బితయ్యె లే
కెప్పటికైన నీచులకు నిట్టి పరాభవమే తలంపఁగన్

అబలలమీఁదనుఁ నాగ్రహించెదగాని
    మగవారిచెంతకుంబర్వవైతి

వనజోండ్ల నడకను ననుసరించెదగాని
        పురుషులజోలికిఁ బోవనైతి
వెల్లకాలంబును నేణాక్షులను జేరి
        మగవారి యెదుటను మాయనైతి
వలరుబోడుల సౌఖ్య మనుభవించుచునుండి
        రతికేళి రాజాధి రాజనైతి
దర్పము సుస్థాయి తత్పరతను జేసి
        ధరణి వర్థిలుచుంటి తలిరుమేన
అబలలెగద ! యని యాశించుచుంటి వే
        వారలే నీప్రాణహారిణులగు

హృదయ దరినుండి వెలివేయ నింతమంద
బుద్ధివి యెచట నాశము బొందెదో గ
దా యని దయదలంప రాధారిలోన
సంచరించుచుంటి వదేమి షండ చండ !

నీకొకింత బుద్ధిని నేర్ప నింతవరకు
నాహృదయసీమ జేర్చితిందలిచు చిలువ
అబల సాహస మింతని యడలు జెంది
పారిపొమ్మిక నిలువకు పాఱుబోతు ?

వ లఁ పు 20-10-29

పూలవనంబు నందుఁ బువుఁబోడులతోడ విహారభోగముల్
లీలగ మందమారుత ప్రవిలేపన ఝూంకృతి వాదనాళిచే

లాలన తోడనుండఁ జపలాక్షికి నేదియొదోఁచె నంతమం
దాలసయయ్యెఁ దానిఁ గని యచ్చోటువాసిరి నెచ్చెలుల్ వెసన్

పాయుటఁజూచి మైమఱచి పాలకరక్షక రాజవీరుడ
మ్మాయయొకింతలేమి సుఖమా! యని ప్రేముడిపల్కుచున్ నిజా
పాయము వీడిపోయెనికఁ బ్రాణభయంబు తొలంగె కాలమున్
పాయఁగలేము రమ్మిఁకను పాటలగంధి విహారలీలకున్

కుమారి

వీటికిఁ జెప్పెదు మాటలఁ
గాటుకయున్నంతవరకె కన్నుల సొబగుల్
జాటగ నాలోచించిన
బాటున కీనేను జడియఁ బాపన చరితా!

రాజకుమార్

చక్కెరబొమ్మ, నాతలఁపు సాగిలినమ్మనవు నమ్మవోగదా!
చిక్కటిలంగ నీతలఁపు బెట్టునఁ జెప్పినదానగావు సొం
పెక్కినయట్టి పూవు పొదపెంపునుజూడ, మయూరనాట్యముల్
యక్కజమొందఁ రమ్మపదవా, యిహలోకము సంతసిల్లగన్

చిల్కలకొల్కి, నన్నిఁకను జిక్కులబెట్టకు సాఁగలేను నా
పల్కుల వాంఛితంబుగొని పొన్నును చేరకయున్న నామనం
బల్కనొనర్పఁగాన విరియాటలఁజెప్పక నాదువాంఛలన్
నిల్కడఁజేసి నన్నిపుడు నీ పరిరంభముఁజేర్చు నెచ్చెలీ!

కుమారి

కనినన్ రాజ కుమారిక
జననాథుని వశయగాదె, చంద్రనిభాస్యా!
అనుచును లలితోక్తులతో
ననయము శృంగారభావ మంకురమొందన్

సాధు, మఱి చాలుఁజాలును
సాధువులకుఁదగునె యిట్టి సరసపు మాటల్
ఆధారకుఁడో మద్గృహ
నాధుని యాజ్ఞలఁగొనంగ నాయముగాదే?

రాజకుమార్

ఇందునిభాస్య, నీసొగసు నీశ్వరుఁడైన గనంగలేఁడుగా
కుందసుహాస, నీ కులుకుఁ గోకులకృష్ణుఁడు గానలేడు గా
చందనగంధి, నీపలుకు చాటువు నేర్పులగాంచలేదు గా
సుందర చుంబితాధర విచుంబిత వాంఛయు నాకులేదుగా

కాని యపూర్వ పుణ్యము సకాలమునాటికిఁ బ్రాప్తియయ్యె నిం
కేను సుఖంబుగాంచి తనియెట్టి దిలాసల నూగులాడితో
పానముగూడలేమి ననుపానములోనికి దింపెనయ్యో! నా
మానముపోయెనేమి యిఁక మానుషకృత్యము సందియంబె కా!

అంత వికసిస దరహాస మంతమొంద
మందమారుత పద్మము మాడ్కిఁబోలఁతి
చలితగాత్రియై భూదృష్టి నిలిపి తనదు
మానసములోని గూరిమింబట్టియిచ్చె

## అల్లుని చాటువులు

పదినెల యాటపాటల నపారముగా విని సంతసించెనే
పదవిని ఆసజెంది పలుబాధలఁ జెందియు నోర్వలేమి నా
హృదయ పుటమ్మునందు సదయామతి నొక్కరి కొక్కరౌచు సం
పదల విహారసౌఖ్యమనుభావన జేయుచునుండి నెమ్మదిన్

ఇంతటి చంచలాక్షులను నెచ్చటఁ జూడఁగలేదు పొమ్మనన్
ఎంతటి కీడువచ్చినను నెంతటి కీడుకు దారిఁ జూపునో
కంతుని నావశంబుగొని కాంతలమీఁదికి నూసి గొల్పి నా
పంతము నెగ్గ సల్పెద నపాంగవిలాస కటాక్ష లీలలన్

పారము లేనియట్లు కడు పర్వెడు వేడి ఘృతంబులోన నిం
పారఁగఁ బంచదారయును ప్రక్కల హాసవిలాస రేఖలున్
గూరిమిఁ గూర్చు బంగరపు గొట్టములున్ యిరువైపులందు శృం
గారపు బువ్వబోడులగు గాంతలు వేఁచెద రల్ప హాసముల్

గారెలలోన రత్నకనకాంగుళిఁ జేర్చి భుజింపుమయ్య రో
గారెలకార్మిపట్టె యని కాంతలు హాస్యపు మాటలందు నొ
ప్పారగ చంచలేక్షణలు పైఁబడి పల్కు నురంతు లేక యే
దారినొ పారిపోయిన గదా సుఖమంచుఁ దలంచు నల్లుడున్

పదినెలార విసుఁడు వందనం బిదియె
యదనున నేమి యునాదరింపకుఁడు
పసిడిబువ్వయు మఱి పంచదారయును
కసమసలిందుము ? కాంతల సూడ్కి

స్వానుభవంబున సంతసమంది
కనుమినుగానక కాంక్షఁజేయుదురు

అబలల గెలువగ నంగములేల
సుబలుల గెలువంగ సుందరులేల
పదినెల గెలువగ మఱదులుపేల ?
అదనున గెలువగ అబలలెగాదె 15-4-1931

మోసగత్తె 15-5-37

ప్రేమసామ్రాజ్యపట్టంబు విడచి సకల
దాసదాసీజనంబులఁ దాల్మి నెవఁడు
మెలఁగునట్టి యీజాతి నీచుల విహీను
లైనవాఁడిల మరణంబునందుటొప్పు

జీవభాధల దరిఁజేరి జీవితంబు
కష్టనష్టంబులొంది యీ కాయమిలను
నిల్పి సేవలఁగాచుట నీచ మరయ
ప్రేమమీదనుస్వాతంత్ర్య ప్రీతివలదె ?

పరులసొమ్మున కాసపడినవాఁడిలకష్ట
నష్టంబులందుట న్యాయమరయ
కపటప్రేమలఁజూపి కాఠిన్యకార్యంబు
లొనగూర్చుపతులకు నువిదయొక
నిజజీవనమ్ముల నిజపోషణమ్ములఁ
దృప్తిజెందుచును బాధించునొకతె

నిలువెల్ల దొంగయై నియమంబువిడనాడి
వీధివీధులఁ జేరు వెలఁదియొకతె

బాధసాధనలన్నిఁ బడుచుండు వెనువెన్క
లాలించు విటు వన్నెలాడియొకతె

నాల్మగల్ ప్రణయంబు నాటించి హాసియించి
కాపురంబులఁ గూల్చు కాంతయొకతె

ముందువెనుకగొండె ముందువెనుకనుయ్యెఁ
ద్రోయించిసాపడు దులువయొకతె

ప్రేమవాక్కుల సుర బ్రీతిగాఁ ద్రావించి
విడియాకులొప్పించు విధవయొకతె

వేదవీధులఁజూపి వేధించిబాధించి
విధవలనూరించు నధమయొకతె

కయ్యాటమొనరింపఁ గాలించిపెనిమిటి
బాధలగుఱిజేయు బడతియొకతె

దబ్బాటుఁగల్పించి టక్కుటెక్కులఁజూపి
దంపతినెడఁజేయు దాదియొకతె

వేషభాషలనేర్చి విధవలై నిలువెల్ల
కొంపలుతీయించు కుమతియొకతె

తనగొప్పతనమును దాంపత్యగరిమంబు
ప్రేమవాక్కులఁదీర్చు వెలఁదియొకతె

హావభావంబుల నార్భాటమొనరించి
దేశాంతరంబుల దిరుగునొకతె

కు నీఁకడ నొకింత శోక విస్ఫూర్తి కెగసి
పని దూరుచు కాపురంబతుకుచుండు
క్షః నింటిగయ్యాలిగంప ! యీయింటి తెంప
జః వలదువలదురతండ్రి యీ బ్రతుకువలదు

అ

న చదువులతల్లి

స

స భాగ్యవంతుని కిహమందు బాధలేదు
ఆ పేదవానికి నిహపరభేదమెంచి
నిఖిలజీవుల కైక్యంబు నియతిగూర్చు
మానవాజ్ఞుల కిహమందు మననమున్నె

సిరులఁ జెలంగి మానవుఁడు సేవ్యతనొందిన నొందుఁగాక స
ద్వరులఁ జెలంగిమానవుఁడు ధన్యుఁడుగాఁడిల భేదమెంచఁగా
విరివిగలోకదుష్టతకు వేధలఁజెందుట పాడియౌట స
త్పురులవివేక మిందుఁగని పాపమునందుఁగూర్క విహీనమై

చదువగనేర్పు లేకమది చంచలభావమునొంది యజ్ఞతన్
బదవులకాశఁజేసి బరిపాటిగ నార్యులబాధపెట్టి యా
పదవులవీడి మానమును మాన్యతలన్ విడనాడి నల్వురున్
పదపద యన్నఁడుల్ పలుక పట్టెనధోగతిఁ నాడునాటికిన్

తల్లీ ! విద్యాకల్పక
వల్లీ ! భాషామతల్లి ! పండితవల్లీ
కల్లలుగావే నామది
నల్లికలల్లిన వివేకమల్లుము తల్లీ !

సరిగమపదనిస సంగీతవిద్యల
　　పాడుచుంటివిగదా ! శారదాంబ !
వేదపురాణవివేక సాహిత్యంబు
　　పాడుచుంటివి దేవి ! సరసిజాక్షి !
సరసశృంగారాది సముచితరసముల
　　పాడుచుంటివి గాదె ! చంచలాక్షి !
నిత్యసంభావ్య సన్నిహితత్వమునం బండి
　　తావళి పూజలం దనుపుచుంటి
వాఙ్మయమాధుర్య వననిధి దరిజేరి
　　క్రీడలాడుచునుంటి కీరవాణి
శృంగారభావసంసేవితావేశ సు
　　రాపానచేష్టల రమణనుంటి !
మధురసమాధుర్య మాంద్యనిమగ్న స
　　మ్మానవిరహమును మానుమమ్మ !
నీదు లీలాసరిన్నీర నిర్నిజన
　　సమ్మానమొల్ల నీసొమ్మె ! యమ్మ !

భక్త సేవకు రక్షింపు పలుకుపడంతి
నీదుభక్తులం దతిజేర్పనీదె విధియు
సకలకోవిదవాఙ్మయ సరసచరణ
భారతీదేవి ! నీకిదె వందనమ్ము

ఒకచేతం దంబుర నొప్పారంగాబట్టి
　　రెయొకచేత ధర్మంబు నొనరం దాల్చి

తాళంబుఁ జేపట్టి తందానఁ ద్రొక్కుచు
హరికథాశరనిధి నణగి మణగి
గజ్జలందియ లెల్ల ఘల్లుఘల్లు మనంగ
సామవేదంబును సరసఁ జేర్చి
తాళమేళంబులు ధమ్ధిక యనఁగనే
విధివాక్యనియమంబు విధిఁగ జరిపి

సరససంగీత సాహిత్యశమదమాది
విధులనొప్పెడి శారదా ! విద్య ! వాణి !
కుసుమసంభారకరయుగ్మకోవిదాళి
పూజలందుము భారతీ ! పుణ్యమూర్తి  15-5-1937

అలరులతావిఁ బూసికొని యల్లన నల్లుఁడు విఱ్ఱవీగుచున్
గలదరహాస కాంతులనుఁ గాంతలు తన్నుఁ గనుంగొనన్ సదా
విలసిత సంతసంబువలె వీవనఁ జేకొని పిల్లగాడ్పులన్
తలిరుల బోడి మీదుగ సదాగతిఁ బంచెను దాక్షిణాత్యమున్

ఆదట సంభ్రమంబు దరహాసము దన్నుఁ జలింపఁ జేయ సం
వాదము వోలెఁ బైఁబడి వివాదముఁ జేయఁగ రమ్మటంచు లీ
లాదరహాస నేత్రకుటిలాలకలన్ దయివాఱబట్ట సొం
పాదర మొప్పఁ బట్టి చరణాంబుజములన్ వలయుంగఁ దోచినన్
కల కలకంఠి స్నేహమెటుగాఁ బరిణామముఁ జెందెనో గదా
స్ఖలిత మాధురీసుధలు సాగిలి చిప్పిలి జాలువాఱఁగా

కలచిబుకంబుఁబట్టి పదకంజమునంబడి లేచి వెండియున్
లలనను సేవఁజేయు వరలాలితవల్లభు లాశ నొందఁగన్.

అండజయాన యిట్లు వలయాంక బిసాంకుర పన్నగాళిచే
నుండక యాననంబు విరహోత్కటబాధ శమింపఁ జేరి యా
దండననున్న మెట్టు విరిదమ్ములఁ గోయుచునుండ మెల్లగా
దండను జేరి శాంతముగ దండను వేసెను కంఠసీమలో

కాతర మొందె లేమ పులకాంకితయయ్యె పసిండి మేను సం
కేత మొనర్చె బ్రీడపడి కేళినిఁ జెందెడి నానసేందుఁడున్
కాతరభావము న్విడిచి కంజదళాక్షి విలాసకేళినై
నూతనసవ్యక్తి వీడి, జిగినూఁగుచు బ్రేలెడు మధ్యగామినై.

అరుణారుణచ్ఛాయ లల్లిన మేనిపై
    గాలియా వలిపమ్ము నేలికట్టి
సంధ్యావధూటినాఁ జక్కగా నటనట
    నుజ్జ్వలాభరణమ్ము లుల్లసిల్ల
వీణచేబూని విన్నాణమరయఁగాయ
    నుత్తుంగకుచముల నొత్తిరాయ
తంత్రీస్వనంబుతోఁ దాండవంబందుచు
    నాదంబు డక్కొనంగ జేయ

అగతులకు సమ్మోదంబు నతిశయిల్ల
బారవశ్యతఁ బాటలఁ బాడిపాడి
గుమ్మురుచునున్న వర్షంబు గుందినట్లు
పాటవిరమించి యేగెను బంకజాక్షి !

అంతఁ దరిఁజేరి నూతనాగంతుకుండు
తన్వి నిట్లనె చకితహృదంతరాళ
భావమును దెలియంగ నోపద్మగంధి!
యకట! యుద్యానవనమెంత యాసగొల్పె

అల్లదె! చూడు! బాల! వికచానన! కంతుఁడు ఫుల్లగోస్తనీ
వల్లరి నావహించి మనభావముఁ గన్గొనఁ నెంచి పొంచి సం
పల్లలితాబ్జబాణములఁ బట్టి యెదుర్కొనుచున్నవాఁడు నా
హల్లకముబ్బఁజొచ్చె మది హాయిగ సంగరరంగమందు నా
పల్లకి కుంజమందు సుఖవార్ధినిఁ దేలుద మిందు బాలికా!

అంతబాలిక మారుమాటాడలేక
నిలిచిన పరాభవంబేమి కలదో యంచు
మేఘమధ్య విద్యుత్ప్రభ మెరసినట్లు
మెఱసి తా మాయమయ్యెను మెఱుఁగుబోఁడి.